# శంబుక వధ

## (ఉత్తరరామ చరిత)

కవిరాజు :

త్రిపురనేని రామస్వామి చౌదరి,

శతావధాని, బారిష్టరు.

B

కవిరాజ సాహిత్య విహారము
గుడివాడ
ప్రచురణ నెం 2.

తొలికూర్పు : 1922

మలికూర్పు : 1934

మూడవకూర్పు : 1964

వెల : రెండు రూపాయలు

ప్రతులకు :

అన్నపూర్ణ పబ్లిషర్సు,
ఏలూరు రోడ్డు :: విజయవాడ-2

# మలి పలుకులు

త్రిపురనేని వెంకటేశ్వరరావు.

(విజయవాడ)

ఈ శంబుకవధను ముప్పదేండ్ల విలంబము పిమ్మట మూడవ ముద్రణము వెలయించు నిప్పుడు సుమారర్ధ శతాబ్దము క్రిందఁ గవిరాజు వెలువరించిన సుదీర్ఘములైన తొలి పలుకులయందు నొండు రెండంశములకు నుపోద్బలక మగు పరిశోధనమును జోడించు టుచితమని తలంచి యీ మలిపలుకులకుఁ గడంగితిమి.

ముద్రణ :

సాయిబాబా ప్రెస్ — విజయవాడ-1

రామాయణకాలము నాటికి లంకాద్వీపము పేరికి మాత్రమే లంక. భరతఖండము నందది యంతర్భాగమై యున్న కాలమొకటంతకు మున్నున్నదనఁజెల్లును. సింహళ గాథలందు రావణానంతర కాలమున సముద్రము లంకాద్వీప పశ్చిమోత్తర భాగముల నిరుమారు ముంచివేసినట్లు గలదు. అనఁగా భారతదేశమునకును నేటి లంకకును నడిమిప్రదేశము కడలిపాలైనది.

రావణుని దుర్వర్తనకుఁ గినిసి తద్వధానంతరము సింహళ మందలి నేటి మన్నారు మొదలు మలయాలము నందిప్పటి టూటికోరిన్ వరకు నాల్గులక్షల ప్రతోళికలుగల యిరువదైదు రావణ దుర్గములను గడలి కబళించినదని 'రాజావళి' నుడువు చున్నది. మరలఁ గ్రీ. పూ. 3వ శతాబ్దిలో గల్యాణినేలిన తిష్యరాజొకఁడొక బౌద్ధ భిక్షువును దనరాణి వాసము తోడి చనవు శంకించి సలసలమను నూనెలో వేఁచెను. నిర్దోషినట్లు గావించిన నేరమునకు వాని పట్టణములను, గడలి ముత్యాలుదీయు జాలారుల పల్లెలను నుదధి మ్రింగినదని రాజావళి కథనము.

ప్రాచీనతమిళసారస్వతమునఁ గూడఁ నీ రెండవ కడలి ముంపు ప్రసక్తమైనది. అనఁగా భరతదేశఁపు దక్షిణాది గ్భాగముగూడఁ గొంత సముద్రగత మైనది. పాండ్య

రాజ్యమునకుఁ దొలుత కవాడపురము రాజధాని. ఇదే రామాయణమున 'ముక్తామణి భూషితము' 'గవాటగుప్తము' నునగు పాండ్యుల హేమపురము. పాండ్యకవాడక మౌక్తిక జాతివిశేషముఁ గౌటిలీయార్థశాస్త్ర మెఱుంగును. రెండవ తమిళ సారస్వత పరిషత్తు (సంగమ్)న కది మనికిపట్టు. నేటి మదురకింకను దక్షిణమున మొదటితమిళసారస్వత పరిషత్తు విలసిల్లిన తెన్‌మదుర యుండినది. ఈ రెండు పట్టణములతో నలువది తొమ్మిది నాడుల పాండ్యభూమి జలధి మగ్నమయినది. పాండ్య రాజధాని నేటిమదురకు జరిగి వచ్చినది.

ఇరుతీరముల సముద్ర మిట్లిరవుకొన్నను నేటికిని దాని కొలఁది యిరువదిమూడు 'మైళ్ళు'. మెగస్తనీసు నాటికిని లంక భరత ఖండమునుండి యొక నదిచే విడదీయబడినట్లున్న దఁట. ఇఁక గవుల వారధి నిర్మాణ మెంతపాటిదో !!

ఇట్లగుటచే లంకకు నిక్కడకు రాకపోకలు తఱచు. వియ్యాలుమెండు. లంకనుండి యీ దేశమునకు వలసలు నెక్కుడు. లంకా రాక్షసులు వింధ్యవరకు నేలిరి. దండకాటవి రావణుని రాష్ట్రము. తెలంగాణమందు గోదావరిగట్టున ధర్మ పురికి దిగువఁగల 'కోటిలింగాల'కు రావణుఁడు శివార్చనకను దినమువచ్చి పోయెడివాఁడని స్థల మాహాత్మ్యము లల్లు కొన్నవి. హిరణ్యకశిపు హత్యానంతరము లంకా రాక్షసులు

దక్షిణాపథ దానవ సంఘములతో కూటువగట్టి యార్యులతో తారకామయమను భీషణ సంగ్రామ మొనరించిరి. బలివైరో చనుని యుద్ధములను, గాలనేమి రణంబునను గూడనదే కూటువగాన వచ్చెడిని. కడకు రావణవధతో ద్రావిడ ప్రభ యణఁగి పోయినది. ద్రావిడు లార్యులకులోఁగిరి. ఆర్యులతో గలిసిరి. రంగు మారినది. మొగము మారినది. మాట మారినది. నూతన జాతులావిర్భ వించినవి. ఎడనెడఁ గొండజాతిని మాత్రము పూర్వనామరూపములు, కొన్ని పూర్వాచారములును బీడించి పీటవెట్టుక నిల్చినవి. తక్కిన జనుల, సంస్కృతుల పుట్టువులను జ్ఞప్తికిఁ దెచ్చు మేనమామ పోలికలుఁగా మిగిలియున్నవి.

నేటి మన సంఖ్యామానమంతయుఁ బదియంకెలమీద నిర్మింపఁబడి నట్టిది. ద్వాదశాంకములు మూలముగా శత సంఖ్య దనుక లెక్కించుకొండొకసంఖ్యామాన ముండినది. అది సింహాళదేశీయమని యేతచ్చారిత్రకుల నిశ్చితాభిప్రాయము. 'మినికాయ్' వంటి సమీపద్వీపము లందిప్పటికి నిది యుండు టనుబట్టి యవి యొకప్పుడు సింహాళముతోఁ గలిసి యుండెడి వని వారూహించుచున్నారు. చూడఁగా మన కొండజాతు లందీ సింహాళ సంఖ్యామాన మిప్పటికిఁ జావకున్నది. శ్రీకా కుళము, కోరాపుట్టి, గంజాము జిల్లాలందున్న కోదుసవర గోందుజాతులందు నీ సంఖ్యామాన మున్నది.

ఇంతియకాక, లంకకుఁజెందిన గాయకజాతియగు 'పాణన్' తెగకూడ దక్షిణ హిందూదేశము నలుగడల జెదరి

జీవించి యున్నది. సింహళమందు 'యాళ్' యను తంత్రీ వాదన మొండుండెడిది. ఈ లంకా విపంచికనే రావణుఁడు పతాకచిహ్నాగా గైకొన్న కళావేదియని కంబ రామాయణ మనుచున్నది. ఈ 'యాళ్' మీఁదఁబాడు 'పాణస్' తెగ వలన లంకా ద్వీపోత్తరభూమి 'యాళ్పాణ' భూమియని పేరొంది, నేటికది వ్యవహారవశమున 'జాఫ్నా' యయినది. సవరలను, కోదులను నంటిపెట్టుకొని వారికన్న నధికులై, వారిని మోసగించుచుండు నొక తెగ 'పాణో'లను పేర నున్నది. శ్రీకాకుళము మైదానములందు స్థిరపడిన వీరే పైడీలనిపించు కొనుచున్నారు. వీరుసంగీతప్రియులు. కొండ తెగలవారి పెండ్లిండ్లవంటి యెల్ల కార్యములకు వీరి వాద్యగీతములే కావలయును. వీరు నేతగాండ్రు. పైడి దుప్పట్లు మన్నికకుఁ బేరు. మలబారు నందునుఁ 'బాణన్' తెగ యున్నది. అది మంత్రగాండ్రపుట్ట. ఆ భూతవైద్యులు వేషములూని పాడుచు నృత్యము గావింతురు. కోరాపుట్టి 'పాణో' లను 'డోంబు' లందురు. అనఁగా బిశాచులు, దయ్యములునని యర్థము. లంక పిశాచ మండలము గదా! తమిళ దేశమందునుఁ 'బాణన్' లున్నారు.

లంకలోఁ గాపురముజేసిన యక్షులు, నాగులు తెలుఁగునాఁట నక్కడక్కడ నప్పుడప్పుడు రాజ్యము లేర్పరచిన జాతులని చారిత్రకు లెఱుఁగుదురు. తదవశేషములు వేరొకకులముగా మిగిలినవారే జక్కులు, నాగవాసపువారును.

పురాణము లెఱిఁగిన నాఁటగోలె లంక యక్షావాసము. సింహళమను పేరు సైతము యక్షభూమినే సూచించును.

సింహపూజ యక్షుల ప్రత్యేకత. యక్షులను సింహ సంబంధులనుఁగా జెప్పుట తెలుగువారికి క్రొత్తకాదు. శాతవాహనులు సాతుఁడను యక్షుఁడు సింహరూపమున మోసి తెచ్చిన బాలుని సంతానము. యక్షులను సింహరూపులనుగాఁ జెప్పుట పౌరాణిక పద్ధతి. లంక తెల్లవారి యధీనమగు నిన్న మొన్నటి వరకును సింహళరాజులు సింహధ్వజులై యుండిరి. లంకకుఁ జెందిన మయాసురుని జెండాయు సింహ లాంఛితము.

సింహళ బౌద్ధ గ్రంథమగు మహావంశముకూడ నొక పురాణగాథను వల్లె వేసినది. సింహ మొక్కటా దేశపు రాజ్ఞిని పెండ్లాడి కన్న సంతుచేఁ బాలింపఁబడిన దగుటచే నాపేరు గల్గినదన్నది. మన పురాణములు సైంహికేయులఁ గూర్చి చెప్పినవి. వారు హిరణ్యకశిపుని చెల్లెలయిన సింహికకు విప్రచిత్తి దానవునకుఁ గల్గిన సంతానము. సింహికాపత్యమైన వారు పేరునుబట్టి సింహ పూజాంకములనుఁ జేబట్టి నారనఁ దగును. సింహిక లంకామాత్రయైనది. హనుమంతుని సముద్ర తరణమున నాగమాతృకయైనసురసతో వచ్చి యెదుర్కొన్నది.

లంకకుఁ బిశాచ మండలమనియుఁ బేరు. యక్షశబ్దము రాక్షసశబ్ద పర్యాయ పదమైనట్లే పిశాచశబ్దమునకు నైనది. ఉపనిషత్తులందును నీ యర్థమున వాడుక గన్నది. లంకావాసులకు దయ్యాలబెడద మనకన్న మిక్కుటమఁట. లంకా ప్రేత విశ్వాసములపై గ్రంథములు బయల్వెడినవఁట.

శివుఁడు పిశాచ గణాధిపుఁడు. యక్షులకును శివుడే దేవర. కుబేరుని యింటివేల్పుగూడ. లంక యట్లేశివుని కొల్వు

కూటమియే. లంక నయిదు విభాగములైన యటవీ పర్వత మరుతీర సేద్యవాటికలకు మాయన్, మురుగన్, కొఱ్ఱవై వరుణేంద్రులు దేవతలంట. వారి పై దేవుడు శివుడంట. మున్నేశ్వరము, కోనేశ్వరము, నకులేశ్వరము, తిరుకేతీశ్వర ములు శైవమహాక్షేత్రములు. యుద్ధమునకై లంకలో నడు గిడగనే రాముడు మున్నేశ్వరమున శివపూజ గావించెను. లంకలో నేటి 'జాఫ్నాకు' దక్షిణభూమిలో రామునకుఁ బూజ లేదు. సమన్ దేవియో పేర లక్ష్మణారాధనము మాత్రమున్నది.

వీరశైవము శాకాహారమును విధించును. పుష్పఫల పత్ర తోయముల పూజ నంగీకరించిన తొలిదేవర శివుడు. నేటికిని దమిళదేశమున శైవసాపాటనఁగా శాకాహారము. అక్కడ శైవము బ్రాహ్మణేతరులదే. బ్రాహ్మణులందు మిక్కిలి తక్కువ. జైనబౌద్ధముల తాకిడికి నుత్తరభారతమున మాంసఁపు దిండిమానని బ్రాహ్మణ్యము శైవమునుఁ దట్టు కొంటకు దక్షిణాపథమున శాకాహార నియమమునకు లోఁగి నది. ఆటవికులైన కోయలందే మాంసముమాన్పి శైవము 'లింగకోయ' లను శాఖను సృజించినది. నేడు లంకలో, దమిళదేశములో బ్రాహ్మణునకుఁ జెల్లుచున్న 'అందణర్' 'పార్పనన్' (ద్రష్ట - తెలుఁగున బాపన) శబ్దము లనార్య ములు. యక్షరాక్షస నాగాది సర్వజాతులవారు జ్ఞానులై యాపేర్లు బొందువారంట. నేటికిని లంకలో అబ్రాహ్మణులైన వెల్లాల పూజారులా 'అందణర్' వ్యవస్థయొక్క యవశేష మందురు. వారు శుద్ధ శాకాహారులు.

విజయుఁడను కాళింగుఁడు లంకలో దిగునాటికి యక్షులు లంకా మధ్య దక్షిణ భాగములందును, నాగులనువారు పశ్చిమోత్తర భాగములందును వసించుచున్నారని "మహా వంశ" కథనము. నాగులువసించు భాగము నాగద్వీపముఁగాఁ బ్రసిద్ధి కెక్కినది.

కేతువు నాగవంశజుఁడని, లంకావాసియని యక్కడ గాథలున్నవి. అతఁడు శివభక్తుఁడు. అతడు శివునిఁ బ్రతిష్ఠించిన యాలయము దిరుకేతీశ్వరమని వానిపేరఁ బ్రశస్తిగాంచినది. మయాసురుఁడు లంకలో మాదోట (మాంద్రై) నేలిన నాగుఁడు. తారకుని సైదోడు. తారకామయము వారిరుగురి యొద్దనము. లంకలో మహిషాసురుని సూచించుచు మహిష ద్వీపమున్నది. లంకా ప్రాచ్య మొకప్పుడు వేరుదీవియఁట. దానికి 'ఎరుమై ముల్లైదీవు' అని పేరు. అది యెరుమై దీవియై నది. ఎరుమై యనఁగా ఎనుము - దున్నపోతు.

పురాణము లందలి మయుఁ డొక్కవ్యక్తిగాడని పించును. లంకా నాగులందు 'ఓవియరు'యను తెగ యొండున్నది. అది శిల్పులతెగ. పంచశిల్పులు నందుపజాతులు. ఆ యేనింట నొక్కరు 'మయులు', వడ్రంగులు. మయులు వాస్తుశిల్పులు. తెలుఁగు దేశమున విశేషప్రచారముననున్న వాస్తువు గర్గవిశ్వకర్మలది కాక, మయవాస్తువే. మయ జాతీయు లెల్లరు నార్యులకు మయుఁడే యైయుండును. ఈ యోవియరు నాగశిల్పులు 'మాంద్రై' రాజధానిగా నేలిన వారు. ఈజాతినిబట్టి చిత్తరువునకు దమిళమున 'ఓవియం' అని

కల్గినది. వీరి మాంద్రై రావణుని లంకాపురికి సమీపమున నున్నది. ఈ రెండు రాజవంశములు వియ్యమందుకొన్నవి. రావణ పూర్వుఁడైన యక్షరాజు శూరపద్మునిసతి పద్మ కోమలి, రావణసతి మండోదరి, కుబేరసతి చిత్రరేఖ యీ శిల్పక రాజకుమారికలు.

వీరి మాఁదోట యెత్తైన యినుప గోడలుగలకోట. రేవుపట్టణము. తమిళ యవన రచనములందట్లే యున్నది. లోహదుర్గమున్న వీరి నాగరికతను బురాణములును లోహ మయముఁగనే జెప్పినవి. గోరూపిణియైన భూదేవినుండి దానవులు మాయాక్షీరములు లోహపాత్రములోనే పిండుకొన్నారఁట. తారకామయుల రథము లోహరథము. శిల్పకులైన మయుల చేతలు (యుద్ధములును) తెలియరానివై, తదర్థమున మాయా శబ్దము ప్రవర్తిల్లిన దనవచ్చును.

దాక్షిణాత్యులందు సాహిత్య మెన్నఁడో యావిర్భవించినట్లు సంప్రదాయమున్నది. భారత యుద్ధకాలమందు మురింజియూరి ముడినాగరాయరను ద్రవిడకవి రెండవ సంగం కవియందురు. రామాయణము బేర్కొన్న మురచి పట్టణమే మురింజి. నేడది జలధి డాగినది. తమిళుల మొదటిసంగం రామాయణమునకుఁగూడ మున్నఁటిది. అందు శివుఁడు, కుమారస్వామియును సభ్యులందురు. మూడవ సంగము సాహిత్యమే లభించుచున్నది. అందుఁ గవులనేకులు నాగవంశీయులు నాగనార్ అను బిరుద నామమున నున్నారు. ముడి

నాగరాయరును నాగుఁడే. తమిళమునఁ గవులైన నాగులు తమ బాసలోఁగాక పోయిరాయని సందియము.

యక్షనాగుల భాష 'యేలు' భాష. 'ఈల' మందలి భాష 'యేలు'. 'ఈలమ్' అనఁగా సింహళియందు బంగారు. సింహళము సువర్ణద్వీప మనిపించు కొన్నదిగదా! నేటి కక్కడ త్రవ్వకములఁబట్టి యీ భాషకు లిపి క్రీ. పూ. మూడవ శతాబ్దికి మున్నెన్నఁడో యేర్పడినట్లు దేలినది. తిష్యారామఁపుఁ ద్రవ్వకములలో మట్టి కుండలపై కుమ్మరులు వ్రేలితో వ్రాసిన యక్షరములు గలవు. యత్తల, మహారామ నిర్మాణముల యిటుకలమీద నచ్చుగట్టి గ్రుద్దిన యక్షరము లున్నవఁట. కుమ్మరులకు నిటుక పనివాండ్రకును నక్షరజ్ఞాన మున్నదనఁగా నా 'యేలు'లోఁ గవనముండకపోవుటెట్లు!

పరాధీనతలో బ్రాంత యానాన్నత్యము చచ్చినది. తమ కళలు మఱుఁగునఁ బడ్డవి. కుమారస్వామి నల్లునిఁగా గొన్న యక్షులు, రావణునివంటి వేదవేత్తను గన్న యక్షులు నేడు లంకలో వికృతులై 'వెడ్డ'లుగా మిగిలినారు. అంతయేల! 'యాళ్' వీణ యదృశ్యమైనది. నూటమూడు 'పణ్' (రాగము) లెఱిఁగిన యక్షజాతి సంబందారు శైవుని నాటికి నరువదొక్కటి మిగిల్చినదఁట. నేటికవి యతని తేవారములందు నిరువది మూటికి సన్నగిల్లినవఁట.

ఇంక రామాయణ జాతులందలి వానరులను గూర్చి ముచ్చటింపవలెనని మనంబున్నను స్థలాభావముచే మరొక్క సందర్భమునకు మిగుల్చుచున్నాము.

---

త్రిపురనేని వేంకటేశ్వరరావు, విజయవాడ.

## రెండవ కూర్పు.

# తొలిపలుకులు

పదియేనేండ్లనాఁడు "శంబుకవధ" ఆంధ్రలోక ప్రచారంబునకై వెడలినప్పుడు లోకము సంపూర్ణ విముఖముగనుండెను. పలుకరించు వారులేరు. ఆదరించువారులేరు. అయినను మొండికట్టైయె దేశదేశములు తిరిగినది. రంగూను వెళ్లినది. దక్షిణఆఫ్రికా వెళ్ళినది. లెక్కలేనన్ని దూరులుపడుచు, లెక్కపెట్టక యిల్లిల్లు తొంగిచూచి తనకుఁ దోఁచిన రీతినీతులు చెప్పినది. కట్టకడకు విముఖముగానున్న లోకము కొంతవఱకు సుముఖమైనది. పలుకరించిరి. ఆదరించిరి. ఆతిథ్యమిచ్చిరి. ఆహ్వానములు వచ్చెను. పిలుపులు వచ్చెను. "మా యూరువచ్చి యుపన్యసింపవలయు"నని ప్రజలు కోరిరి. పిలుపువచ్చిన చోటికెల్ల నేగినది. ఉపన్యసించినది. ప్రజల యొక్క దృక్పథములో మార్పు గలిగించినది. భావపరిణామము చేకూర్చినది. రామాయణ కథనుగూర్చి తర్క వితర్కములు బయలు దేరినవి. పెక్కురు బ్రాహ్మణేతరులు శంబుకవధ న్యాయముకాదని నమ్మఁజొచ్చిరి. కన్నవారలెల్లరతో వాద ప్రతివాదములకు దిగిరి. తమ ప్రశ్నలకుఁ దగిన సమాధానములు రామిచే శంబుకవధ, వధయే యనుకొనసాఁగిరి.

ఈ మార్పుఁ గాంచి, కలవరపడి పెక్కురు బ్రాహ్మణులు, చదువుకొన్నవారు, చదువుకొననివారు, "శంబుకవధ" పై దాడి నడిచిరి. ఒక్క కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి విమర్శనము దక్కఁ దక్కినవన్నియు హేయములుగను, సూయాగ్రస్తములుగను, నిందాభూయిష్ఠములుగనునుండెను.

కాన వానిని మఱుగుపరచుటకు ప్రయత్నించుట యుచితమని తలంచు చుంటిమి. బ్రహ్మయ్యశాస్త్రిగారు మా వాదమెల్లనంగీక రించుచు, శంబుకవధను ప్రేరేచినది, వసిష్ఠుఁడు కాఁడనియు నారదుఁడనియు, నారదుఁడు బ్రాహ్మణుఁడు కాఁడనియు, దేవర్షి యనియు, నందుచే నీ యకార్యమును బ్రాహ్మణుల నెత్తిపైఁ బడవేయుట ధర్మము కాదనిరి. ఇది సత్యమే. కాని నారదుఁడు దేవర్షియైనను, బ్రాహ్మణుల ఛాయయే. బ్రాహ్మణుల చేతిలోని కీలుబొమ్మయే. బ్రాహ్మణులచేతి కోఁతిముట్టే. అందుచే భేదమాత్రే కన్పట్టదు. శంబుకవధ న్యాయమా? అన్యాయమా? యను సంగతి జర్చించు నప్పుడెవరు ప్రేరేచి శ్రీరామునిచేఁ జేయించినది తీసికొనఁదగిన విషయము కాదని మా యభిప్రాయము.

ఇంతియకాక; నారదుఁడు మోసగించి శ్రీరామునిచే శంబుకవధ చేయింప నున్నప్పుడు, వంశగురువగు వసిష్ఠుఁడు దానిని జరుపకుండఁ జేయవలసియున్నాఁడు. అట్టిది తటస్థింప లేదు. కావున వసిష్ఠునకు శంబుకవధ యిష్టమనుట స్పష్టము. బహిరంగముగాఁ బ్రోత్సహించినను, లేకున్నను, గనుసైగచేఁ జేయించెననుట విదితము. ఇయ్యది ఫలములేని భేదము.

ఇఁక యుగములఁగూర్చి యొక్క మాటఁజెప్పెదము. పూర్వులు చేసిన యుగనిర్ణయము, వత్సర సంఖ్యా పరిమితి ప్రచారమున నెన్నఁడున్నట్టు పొడకట్టదు. ఈ వాక్యమును ఋజువుచేయుటకు నీ క్రింద హిరణ్యకశిపుని వంశవృక్ష మిచ్చుచున్నాము. ఇయ్యది నిజమును దేట తెల్లము చేయ గలదని నమ్ముచుంటిమి.




చూచితిరా చిత్రము! బలిచక్రవర్తి కూఁతురు త్రేతాయుగము నందున్నది. కొడుకు కూఁతురు ద్వాపరాంతమున నున్నది. దీనింబట్టి యుగముల విషయమై యేమి తేలునో చదువరులూహించుకొందురుగాక. ఇంకొక్క విషయము. పై వంశవృక్షమును బరిశీలింపుడు. ఒక్క వంశమును రూపుమాపుటకు భగవంతునకు నాలుగవతారము లెత్తవలసి వచ్చినది. అహో! యిది యెట్టి మహావంశమో కదా. జాత్యుద్ధరణకై యిన్ని తరములు పెనఁగులాడిన

యుత్కృష్టవంశము మఱియొక్కటి మన దేశమునఁ గన్పట్టదు. శ్రీకృష్ణుఁ డనార్యుఁడగుటచేతనే బాణాసురుని మహా యుద్ధమున నోడించి విడిచి, చుట్టఱికముఁగూర్చి కొనెనేగాని, యార్యులవలెఁ జంపివైవలేదు,



# తొలికూర్పు

# తొలిపలుకులు

## ప్రాచీన హిందూదేశము

### ద్రావిడులు

రామాయణ కథాకాలమునాఁడు హిందూదేశ మెట్లున్నదో విచారింపకమున్న తత్పూర్వస్థితిగతులను దెలిసికొనుట యుచితమగుటయేకాక యవశ్యమనికూడ భావింతుము. వీనిని దెలిసికొనినఁగాని శ్రీరామచంద్రుఁడు భగవదవతారముగాఁ జేయఁబడుటకుఁగల కారణములు సులభముగా బోధపడవు. ఇందుచేతనే రామాయణ కాలము నాఁటికిఁ బూర్వమున్న హిందూదేశ పరిస్థితులనుగూర్చి యిచ్చట శాఖాచంక్రమణముగానైనను ముచ్చటింప బూనుకొంటిమి. ఉత్తర కురుభూములనుండి యార్యులు హిమాలయపర్వత సానువులఁబడి, కనుమలగుండ, హిందూదేశముఁ జొచ్చునప్పటికే యీ దేశము జనాకీర్ణము కాకపోయినను, మానవ సంవాసితమై యుండెననుటకు సందియములేదు. నాగరికతయందు హెచ్చులొచ్చులున్నను, నీ యాదిమవాసులెల్ల రొక్కజాతివారనుట యనుమానాతీతంబు; వీరే వేదములు మొదలగు తొలిపలుకులయందు దస్యులనియుఁ బురాణములయందును, నైతిహ్యములయందును, గొన్ని మహాకావ్యముల యందును రాక్షసులనియు, వానరులనియు, స్మృతులయందు ద్రావిడులనియుఁ శూద్రులనియుఁ బేర్కొనఁబడిరి. కొందఱి యభిప్రాయమున

నీజాతి యార్యులకన్న నధిక నాగరకతకలదనియుఁ గొందఱి మతమున నట్లుకాదని నేఁడు వినుచున్నాము; కాని యార్యుల కన్న నాగరకతయందు వెన్నబడియుండెననియుఁ, దారతమ్యము మాత్రమత్యల్పమనియు మా యాశయము. కాకున్ననార్యులు వీరలను దస్యాది నామములచే వ్యవహరింప సాహసించి యుండరు. సంస్కృత గ్రంథములు వివేకముమాని గొంతెత్తి చెప్పుచున్నట్లు వీరు పచ్చిమాంసమును, నర మాంసమును దినెడువారా యనునది విచారణీయము. విరోధులను గౌరవ భావముతోఁ జూచి యున్న సౌజన్యమును, సౌశీల్యమును నొప్పుకొనుట మానవస్వభావముకాని యట్లు కన్పట్టుచున్నది. నేఁడు జర్మను భాషాగ్రంథములు చదివినవారికి "ఇంగ్లీషు" వారును, "ఇంగ్లీషు" భాషాగ్రంథములు చదివినవారికి జర్మనులును రాక్షసులుగాఁ దోఁపక మానరు. విపక్షులను గూర్చి వ్రాసిన సంస్కృత గ్రంథములు చాలవఱకిట్టి భావమునే వెలిపుచ్చెనని మేమభిప్రాయపడుచుంటిమి. ద్వితీయపక్ష రచిత గ్రంథము లేమయిననున్న యెడల దౌర్భాగ్యవశమ్మున మన కంటబడకుండుట శోచనీయము. ఇందుచేతనే ప్రాచీన హిందూ దేశమును గూర్చి యిదమిద్ధమని రూఢిపఱచుటకు మిప్పుల సాహసము కావలయును. ఈ యాదిమ వాసులను మేము ద్రావిడ శబ్దవాచ్యులనుగాఁ జేసినందులకుఁ జదువరులు మన్నింతురుగాత.

నాగరకత్వ తారతమ్యమునుబట్టి ద్రావిడులను రెండు భాగములుగా విభజింపవచ్చును; (1) మాంసభక్షకులు (తారకాదులు) శాకభక్షకులు (వాలిసుగ్రీవాదులు) మాంస

భక్షకులు రాక్షసులనియు, శాకభక్షకులు వానరులనియు వ్యవహరింపఁబడిరి. వానరులకుఁ గిష్కింధా పట్టణమాయువు పట్టు, రాక్షసులకు లంకాపట్టణము గుండెకాయ. రాక్షసులు వివిధాపక్వ మాంసభక్షకులని గీర్వాణగ్రంథములు వాకొనుచున్నవి. సింహళద్వీప చరిత్ర పరిశోధనబుద్ధితోఁ జదివిన యెడల నచ్చటి యాదిమవాసులయిన యక్షులపక్వమాంస భక్షకులుగా నున్నట్లు పొడకట్టును. మలయాల ప్రాంతమున నున్న నొకజాతి స్త్రీ పురుషులందఱు తమపండ్లను నాకు రాయిచేఁ గోరలుగాఁ జేసికొను నలవాటు కలదనియు, నిది యొక కాలము క్రిందటనున్న నరమాంసభక్షకచిహ్నమనియు నొకరు వాదించుచున్నారు. ఇది నిజమయినను గావచ్చును. ఇంతయేల ? ఆర్యులయందు * నర మేధమను నొకవిధమగు యజ్ఞమాచరణలోనున్నది. నేఁటికిని పసిఫిక్ మహాసముద్రము నందున్న దీవులయందు నరమాంస భక్షకులున్నారు. సమస్త దేశముల యందును నెప్పుడో యొకప్పుడు నరమాంసభక్షకు లుండిరి. ఈ రాక్షసులయందు నెక్కువ పరిజ్ఞానముకలవారు వీర శైవులుగా నుండిరి. ఇందుచేతనే పురాణములన్నియు సామాన్యముగా. రాక్షసులను శైవభక్తులనుగా వర్ణించినవి. జాతివిరుద్ధముగా నెవ్వఁడో యొక్కఁడు విష్ణుభక్తుఁడుగా నుండెడి వాడు. ప్రహ్లాదునకిందుచేతనే యన్ని కడగండ్లు వాటిల్లినవి.

---

* అంబరీషుఁడు ఋచీకుని కుమారుఁడయిన శునశ్శేఫుని లక్షగోవులనిచ్చి యజ్ఞపశువుగాఁ గైకొనియె. బాలకాండము; భాస్కరరామాయణము.

సోమకుఁడు కుమారునిజంపి నరమేధమును జేసెను.

అరణ్యపర్వము తృతీయాశ్వాసము భారతము.

ఈ ద్రావిడులకుఁ బట్టణములు కాని, పల్లెలు కాని, మొట్టమొదట లేవు. నేఁటి కోయ, చెంచు మొదలగు జాతులంబలె, నే చింతతోఁపులయందునో, యే చెట్టుల మధ్యనో, తాత్కాలిక కుటీరములయందు నివసించుచుండిరి. వీరు వనాటులు. చీమలు దూరని చిట్టడవియైనను, కాకులు దూరని కారడవియైనను, మూలముట్టుగ వీరికవగతము. అడవులయందున్న దొంగదారులను, సందుగొందులను, వీరు బాగుగా నెఱుంగుదురు. అటవీరాజ్యమే వీరి రాజ్యము; అడవులుకూడ వీరి నామములచేతనే పిలువంబడుచుండునవి. అటవీ రహస్యజ్ఞాన మార్యులకు లేకపోవుటచేత రాత్రులడవులు బాగుగ నెఱింగిన ద్రావిడులకు మిగుల భయపడుచుండువారు. రాక్షసులకు రాత్రులు బలమెక్కుడని చెప్పు పురాణాదుల వాక్యములకుఁ గారణమిదియే.

వీరికి వైవాహిక నిబంధన లేవియు లేవని చెప్పవచ్చును. అన్న భార్యను దమ్ముఁడుంచుకొనుటయుఁ; దమ్ముని భార్యను నన్నయుంచుకొనుటయు దోషము కాదయ్యె. సోదరీసంపర్కముకూడ హేయముగాఁ దలంపఁ బడినట్లు కన్పడుటలేదు. ఈజిప్టు దేశమునందుఁ జిరకాలము క్రిందట రాజవంశమునకు సాంకర్యము కల్గునని చెప్పి యేకగర్భజాతులే పెండ్లియాడుచుండిరి. బోర్నియో దేశము నందిప్పటికిని నక్కచెల్లెండ్ర బిడ్డలకును నన్నదమ్ముల బిడ్డలకును వివాహములు గల రషియా దేశపు చక్రవర్తికుటుంబమునఁ దఱచిట్టి యుద్వా ములు జరుగుచుండెడివి. వర్తమాన కాలంబున మహ దీయుల యందును, క్రైస్తవులయందును నిట్టి పెండ్లిండ్లున

ఎక్కడికో పోవుటేల మనకు నేవమును బుట్టించు కొన్ని విధములగు పెండ్లిండ్లు శుద్ధద్రావిడ దేశమయిన మలయాలము (కేరళదేశము) నందు నేఁటికిని నాచార మందున్నవి. ఈ ద్రావిడులు సర్వసాధారణముగఁ జెట్టును, బుట్టను, తాయిని అప్పను, వేయేల జంతుసామాన్యమును దేవరలగాఁ దలంచి పూజించువారు. తెలుఁగుదేశము మొదలు కన్యాకుమారి యగ్రము వఱకుఁగల పల్లెలలోను, బట్టణములలోను, నీ దేవరలను నేఁటికిని జూడనగును. కాలక్రమమున నీ రాయిరప్పలు పోలేరమ్మ, అంకమ్మ, మద్దిరామమ్మ, పోతరాజు మొదలగు గ్రామదేవతలుగా మాఱి జన్మస్థానమయిన ద్రవిడదేశమును వదలనేరక నేఁటికిని నిందెతాండవమాడుచున్నవి. క్రమక్రమముగా నియ్యవి తెలుఁగుదేశమున రూపుమాయుచున్నను, నఱవదేశమునఁ జూరుపట్టుక వ్రేలాడుచు గ్రామరక్షణఁ జేయుచునే యున్నవి. ఇంతియ కాక నాగుల చవితినాఁడు పూఁబోఁడులెల్లరు పాలు పుట్టలలోనున్న పాముల పాలుసేయుచుండుట మనము చూచుచునేయున్నాము. నాగేంద్రస్వామియని పేరుచెప్పి యువతీ జనంబు తమతమ పిల్లల జుట్టును భక్తిపురస్సరంబుగా నర్పించి సంతసించుట కాంచుచునే యుంటిమి. వేల యేండ్లు కడచినను నిట్టివి తెలుఁగు దేశమున రూపు మాయకుండుట కడు చిత్రము. ప్రాచీనాచారములయందు హిందువులకున్న మూఢ విశ్వాసమే యిందులకుఁ గారణము.

## ఆర్యులు

దేశమిట్టి స్థితియందుండఁగా నుత్తర కురు భూముల

నుండి యార్యులు హిమాలయ దరీముఖద్వారములను దాఁటి హిందూదేశముపైఁబడి ద్రావిడులను దక్షిణాపథమునకుఁ దఱిమిరి. మొట్టమొదట వీరతిసారవంతములగు సింధు గంగా నదీ ప్రాంత భూముల నాక్రమించుకొనిరి. ఇచ్చటనే యార్య ద్రావిడులకు భయానక యుద్ధములు సంభవించెను. కొన్నియెడలఁ దుములసమరములు, కొన్నియెడలఁ దులారణములు గల్గి కొన్ని వందల యేండ్ల వఱకు జయాపజయములు నిర్ణయింప వలను పడదయ్యెను. క్రమ క్రమముగా ద్రావిడులు వీఁగిరి. ఆర్యులు వీరలను దక్షిణ దిక్కునకు నెట్టివేసిరి. ఈ యుద్ధములనే పురాణాదులు దేవదానవ యుద్ధములుగా వర్ణించినవి. తుట్టతుదకు నీ యార్యజైత్రయాత్రా సముద్రమునకు వింధ్యపర్వతపంక్తి, చెలియలికట్టయైనది. జాతివైషమ్య మప్పుడే యంకురించినది. నాఁటనుండియు వింధ్యపర్వత దక్షిణభూమి పాపభూమియనియు నుత్తర దేశము పుణ్యభూమి దేవభూమి, నార్యావర్తమనియు, బ్రహ్మావర్త మనియు, బ్రహ్మర్షి దేశమనియు సంస్కృతకవుల గ్రంథములయందు వాసికెక్కెను. చిరకాలమువఱకునార్యులు వింధ్యపర్వత పంక్తి నుత్తరించి దక్షిణాపథమునకు రాఁ బ్రయత్నింపరైరి. వీరి మాతృభాష గీర్వాణము. అందుచేతనే యీ కాలమందు దేవభూమియందు వ్యవహరింపఁబడుచున్న గీర్వాణమునకు దేవ భాషయను నామము కల్గినది. వింధ్య పర్వతము నుత్తరించి ద్రావిడులకు సనాతనధర్మము బోధింప మొట్టమొదట వచ్చినది యగస్త్యుఁడు. దీని నాధారముఁ జేసి కొనియే పురాణములు సూర్యున కడ్డమయిన వింధ్యపర్వతమును నగస్త్యుఁ డణఁగఁద్రొక్కెనను గాథను గల్పించినవి.

ఆర్యశబ్దమునకుఁ గృషీవలుఁడని కొందఱర్థముఁ జెప్పు చున్నారు. ఈ యర్థమెట్లున్నను హిందూదేశముఁ జొచ్చునప్పటికి నార్య సంఘము త్రివర్గముగా విభజింపఁబడి ధర్మబద్ధమై యుండెను. బ్రహ్మక్షత్రియ వైశ్యులను, మూఁడు వర్ణములే నాఁడార్య సంఘమందున్నవి. ద్రావిడులతో జరిగిన యుద్ధముల పిదప, విజితులయిన ద్రావిడుల నందఱను గలగూరగంపఁజేసి శూద్రు లనునామకరణముతో నాల్గవ వర్ణమని చెప్పిరి. ఇందుచేతనే యార్యులకు మాతృభాష యగు గీర్వాణమును నాల్గవవర్ణముగు శూద్రులభ్యసింపఁగూడదనియు శాసింపఁబడెను. జాతివైషమ్యము పెచ్చురేఁగిన కొలఁది వీరికి మానవసామాన్యములగు స్వత్వములు నిషేధింపఁబడెను. వైశ్యులకు పాశుపాల్యము నియత ధర్మముగా నిర్ణయింపఁబడెను. ఈపాశుపాల్యము నాగరకత నిశ్రేణికయందు మొదటి మెట్టని మాయాశయము. కాన మృగదశనుండి కంటంబడిన వన్యమృగముల మీఁదను, నాకలముల మీఁదను, గాయగసరుల మీఁదను నాధారపడక గోవులనుబెంచి పాలరుచి మెఱుంగుటచే ద్రావిడులకన్న నెక్కువ నాగరికత కలవారని భావించుచుంటిమి. ఈ తారతమ్యము మాత్రమత్యల్పము. ఇయ్యది యీ పీఠికను సాంతముగాఁ జదివినవారికి బోధపడఁగలదు.

సారవంతమై, ఫలభారనమ్రతరుసమావృతమై, పుష్పలతాపరిష్కృతమై, నిర్మలోదక నదీ సంసేవితమై, నందనోద్యానముంబోలియున్న యీ హిందూదేశ మార్యులకు మిఱుమిట్లుగొల్పి, యాశాబద్ధులంజేసి యిందు నెలవు లేర్పఱచి కొనుటకు బుద్ధిపుట్టించుటంజేసి, నేటి కియ్యది వారి జన్మ

భూమియయ్యెను. వీరు సంపూర్ణ మాంసభక్షకులుగా నుండు టయే కాక గోమాంస భక్షకులుగాఁ గూడనుండిరి. ఇంతియ కాక గోమేధము పుణ్యకార్యముగాఁ గూడ భావింపఁబడెను. నరమేధముకూడ నచ్చటచ్చట యవలంబింపఁబడుచుండెను. భవభూతి యుత్తర రామచరితలో వాల్మీకి కాతిథ్యమొసంగు సందర్భమున జాగరూకులమై పరీక్షించినచో వసిష్ఠుఁ డెట్టి తఱపి పెయ్యను జంపి విందు చేసినది తెలియఁగలదు' ఒక మహారాజు నిత్యబ్రాహ్మణ సమారాధనకయి గోవులనుజంపి యా చర్మములను మెట్టగా వైచిన నందుండి స్రవించిన ద్రవమే (ఇప్పుడీ నది "చంబల్" అను పేరుతో వ్యవహరింప బడుచున్నది.) చర్మణ్వతీ నదియయ్యెనన్న భారతకథ మన కన్నులం దెఱచి సత్యమును మోమోటము లేకుండఁ జూపిం పఁగలదు. నేఁడు మాంసభుక్కుల యిండ్లకుఁ జుట్టములరుదెం చిన వెంటనే యే కోడినో, కోయుచుండునటులఁ బూర్వ మతిథి యింటికి వచ్చినచో నాఁబెయ్యను జంపి వండుట యాచారముగా నుండెను. ఏతత్కారణంబున నతిథి "గోఘ్నుఁడు" అను బిరుదముఁ దాల్చెను. వలయునేని యింకను బెక్కుదాహరణములను జూపింపఁగలము.

వీరి వైవాహిక నిబంధనలు ద్రావిడుల సంబంధము లట్ల హేయముగనే యున్నవి. పున్నామనరకమునుండి తప్పించుకొనుటకుఁగా సంతాన లాభమునకై యొక ఋషి మఱియొక ఋషిపత్నిని "బాడిగ"యైన లేకుండగనే గ్రహించి పుత్రసంతాన ప్రాప్తియగుడు మరల నంపివేయుట తటస్థించు చుండెను. ఒక స్త్రీ పలువుర మగలను గైకొనుటకాని, యొక పురుషుఁడు పలువుర స్త్రీలను గైకొనుటకాని, దోషము

కాదమ్యో. పంజాబు దేశమునందు నొక తెగ హిందువుల యందు నన్నదమ్ములందఱు నొక యుమ్మడి భార్యను సంపాదించుకొను నాచారము నేఁటికిని బ్రబలి నిరాటంకముగా సాఁగుచున్నది. ఎవ్వఁడయినఁ దెగించి యీయాచారమునకు వ్యతికరించి పెండ్లాడినచోఁ దత్సాంఘికులు వానిని గొంచెము వానినిగాఁ జూచుచుందురఁట.

ఉత్తర కురుభూములనుండి వచ్చిన యార్యులు తమ జన్మస్థానమును దేవలోకమనియు, త్రివిష్టపమనియుఁ దమ గ్రంథములచేఁ జెప్పించిరి. ఈ త్రివిష్టపమే "టిబెట్" అని యిప్పుడు పిలువఁబడుచున్నదని కొందఱి చరిత్రకారుల యాశయము. "టిబెట్" పీఠభూమి, అనఁగా హిందూదేశపు మైదానమునకు సుమారు మూఁడు మైళ్ళ యెత్తున నుండును. ఇంత యెత్తున నుండుట చేతనే త్రివిష్టప మాకాశమందున్నదని పౌరాణికులు చెప్పిరి. ఈ చరిత్రకారుల యభిప్రాయము నిజమనుటకుఁ గొన్ని బలవత్కారణములు గన్పట్టుచున్నవి. మన హిందూదేశమునకును నీ త్రివిష్టపమునకును, నెంత దుర్గమమైనను దారియొకటి కలదని పురాణములు చదివిన వారికెల్లరకుఁ దెలియఁగలదు. పురాణము లెట్టి దారులు కల్పించిన నేమి ? స్వర్గలోకమునఁ బూజ్యార్హుఁడును, దేజోవంతుఁడును, బ్రజలు నమ్మఁగల రాజు లేకపోవుటచే స్వర్గలోక వాసులు మన హిందూదేశమునకు వచ్చి, యసమాన ప్రజ్ఞాధనుఁడైన నహుషునింగొనిపోయి పట్టాభిషిక్తునిం జేసిరి. కృష్ణుఁడు సత్యభామా సమేతుఁడయి, కల్పవృక్షమునకయి స్వర్గలోకముపయి దాడి వెడలియుండెను. అర్జునుఁడు కూడఁ గారణాంతరములచే స్వర్గలోకమును జూడఁబోయెను. అనఁగా "జనక

తండ్రి'' యింటికిఁబోయెను. అప్పుడర్జునుఁడు స్వర్గలోకమునఁ జూచిన యాచారవ్యవహారములకును, నేఁటి టిబెట్టులోనున్న కొన్ని యాచారవ్యవహారములకును, భేదము రవ్వంతయుఁ గానఁబడదు. స్వర్గలోకమున స్త్రీ పురుషులకు వావివరుస లక్కఱలేదు. టిబెట్టునందు నంతియే. స్వర్గలోకమున స్త్రీ పదిమంది పురుషులను గొంగునముడివైచి, "టింగురంగా" యని తిరుగవచ్చును. టిబెట్టునందు నంతియే. ఈ యాచారమే టిబెట్టునుండి యార్యుల మూలమునఁ బంజాబు దేశంబున కాలి చప్పుడు కాకుండఁ బ్రవేశించినది. ద్రౌపదీదేవి వివాహము దీని ఫలమని మా యాశయము. దీనికిఁ బూర్వము కూడ నిట్టి యుద్వాహములున్నవని పురాణముల వలన మనకుఁ దెలియుచున్నది. గౌతముని కూఁతురగు జటిలయను బ్రాహ్మణకన్య యేడ్వురను, వార్ణియను ఋషికన్య పదిమందిని బెండ్లాడువఱకుఁ దనివిఁజెందలేదఁట. ఇట్టి వివాహము లింకను బంజాబు దేశమునందున జరుగుచునే యున్నవి. స్వర్గలోకమున నతిథితో వ్యభిచరించుట దోషముగాఁ బరిగణింపఁబడదు. టిబెట్టునందు నతిథికి భార్యను వ్యభిచారమునకయి సమర్పించు నాచారము గొన్ని చోటుల నింకను బ్రవర్తిల్లుచున్నది. ఈ కారణములచే "టిబెట్" త్రివిష్టపమగు నేమో యని భావింప ననువగుచున్నది. పూర్వోదాహృత పరిస్థితులన్నియు నాఁడు నాగరకత శైశవావస్థ యందున్నదని ఋజువుచేయునని నమ్మెదము. వీనిని దిలకింప నార్యద్రావిడ నాగరకతా తారతమ్య మిసుమంతయని తోఁపకమానదు.

# రామాయణ కథాకాల హిందూదేశము,

## ద్రా వి డు లు  (వా న రు లు)

రామాయణ కథాకాలమునాఁడు ద్రావిడ దేశము (అనఁగా వింధ్యపర్వత దక్షిణదేశము) సాంద్రారణ్యములతోఁ గీచు మనుచున్నది. ద్రావిడులు చెట్టులం, గుట్టలం బట్టి యుండిరి. మానరక్షణకై వస్త్రధారణముఁ జేయుచుండిరి. నేఁటి తెలుఁగు దేశము దండకారణ్యముగా నుండెను. పంచవటి, జనస్థానము మొదలగు పల్లెలుదక్క నీ యరణ్యము నిర్మానుష్యము కాకపోయినను నిష్పల్లి యని చెప్పవచ్చును గాని కొన్ని కొన్ని భాగములు రాక్షసుల యేల్బడి బడి యున్నవి. బళ్ళారి ప్రాంతము జనాకీర్ణమై యుండెను. ఇదియే రామాయణమునందు సుప్రసిద్ధమగు కిష్కింధాపురసీమ. రావణాపహృతభార్యుఁడై శ్రీరామచంద్రుఁడు వర్షకాలంబున సీతావియోగ దుఃఖముచేఁ గృశించి, కృశించి, కాపురము చేసిన మాల్యవంతమిదియేయని తత్సీమ వాసులు చూపించుచుందురు. ద్రావిడ జాత్యంతర్భాగమగు వానరలోకంబునకు నిదియే నునికి పట్టు; ఇంతకుమున్ను సుప్రసిద్ధ వానరులుకాని, వానరనగరంబులు కాని యున్నజాడ పొడకట్టదు. ఇప్పుడిప్పుడే వానరులాటవికదశనువీడి నాగరకు లగుచున్నారు. అనఁగా నడవులలోను, గొండల మీఁదను, తోఁపులలోను దలదాఁచుకొనుట మాని పట్టణంబులఁ గట్టికొని యందు వాసమును జేయుటకుఁ బ్రారంభించిరి. ఇందుచేతనే యొక్క కిష్కింధాపట్టణము దక్క వానరులకుఁ బట్టణములు లేవు. రామాయణ కాలమున వాలి వానరసార్వభౌ

ముఁడై యిచ్చట నతిపూజ్యముగ రాజ్యమేలుచుండెను. పరిసర దుర్గమ దుర్గములు, నరణ్యములు, చిన్న చిన్న పల్లెలతో నిండి యుండెను. ఇయ్యవి యొక్కొక్క దండనాథుని యాధిపత్యములో నుండెడివి. జాంబవంతసుషేణ, నల, నీల, మైంద, ద్వివిదాదు లీ పల్లెలకు రాజులు. వాలిసార్వభౌముని సరదార్లు. ఈ ద్రావిడ యోధులకెల్లను గిష్కింధాపట్టణము గుండియ.

వీరికింకను నార్యసంపర్కము కలుగలేదు. కాని యార్యులు (అనఁగా ఋషులు) దండకారణ్యముఁ బ్రవేశించి యచ్చటచ్చట పల్లెలం గట్టుకొనిరి. ఈ జాతిద్వయమున కింకను బరిచయము కలుగలేదు. దేశదిమ్మరియైన హనుమంతుని వంటివాఁడెవ్వఁడో యీపాటి పల్లెలను జూచియుండును. రామాయణమువలన హనుమంతుఁడు నాల్గునాళ్ళపట్టపవలుగ ఋషుల సాహచర్యమనుభవించెనని తెలియఁగలదు. ఈ సాహచర్యమే వీనికొంపఁదీసి రామునకు దాసానుదాసునిగఁ జేసినది. కాని యార్యుల యాచార వ్యవహారము లింకను వానరుల తలకెక్కలేదు. ఇందుచేతనే వానరులకుఁ గల్లు ద్రాగుట మొదలగు నార్యుల సుగుణంబులు పట్టువడలేదు. యజ్ఞయాగాదులు వీరెఱుంగరు. బలులు వీరెఱుంగరు. మాంస భక్షణంబు వీరెఱుంగరు. జైత్రయాత్రలని చెప్పి దేశమును సంక్షోభింపఁజేయుట వీరెఱుంగరు. ఏ పుట్టతేనెయో ద్రావుచు, నే మావిపండో కడుపారఁదినుచుఁ గాలక్షేపముఁ జేయుచుండిరి. భార్యలు తారుమారగుచున్నను బెండ్లిండ్లు గొంత వరకు కట్టుదిట్టములకు లోఁబడినవి. గృహచ్ఛిద్రములకుఁజిక్కి వాలి సుగ్రీవుని నిల్లువెడలఁదరిమి యాతని భార్య రుమను గ్రహించెను. ఇటులే వాలి వధానంతరమా తద్భార్యయగు

తారను సుగ్రీవుఁడు కైకొనియెను. గృహస్థాశ్రమ మత్యావసర మను నభిప్రాయ మప్పటికి లేదు. ఆర్యులం బోలి వీరికిఁ బున్నామ నరకములేదు. ఇందుచేతనే హనుమంతుఁడు బ్రహ్మచారిగా నుండెను.

"వానరులు" అనఁగా వికృత నరులు, అనఁగా సౌందర్య విహీనులు. ఇట్టిజాతులింకను నీలగిరి మొదలగు కొండల మీఁదను, నరణ్యముల యందున్నారు. * సవర (శబరు)ల యందు "అరసి" యనుజాతి యొకటియున్నది. అరసి యనఁగా క్రోఁతి యని యర్థము. ఈ జాతినే "లంబోలంజ్" అనికూడ పిలుచుచుందురు. అనఁగా దీర్ఘవాలము కలవారని యర్థము. దీర్ఘకౌపీనము పెట్టుకొనుటచే దీర్ఘవాలము కలవారని పిలువం బడుచుండిరి. ఇంతియే కాని తోఁకలున్నవని తలంపము. రామాయణమున రుమతారలను వర్ణించునప్పుడు వాల్మీకి తోఁకలున్నట్లు చెప్పలేదు. హిమాలయసాంద్రారణ్యములోఁ గూర్చుండి రామాయణము వ్రాయఁబూనిన వాల్మీకి వానరులు కోఁతులవలె నుందురనివిని, తత్కారణంబునఁ దోఁకలు కూడ నుండుననిఁ భ్రమపడి యచ్చటచ్చట వీలయినప్పుడెల్ల వానరులకుఁ దోఁకలు తగిలించినాఁడని తలంతుము. జాంబవంతుని కూఁతురగు జాంబవతిని కృష్ణుఁడు పెండ్లాడెను. వ్యాసభట్టారకుఁడు జాంబవతికిఁ గూడఁ దోఁక తగిలించక పోవుటయేకాక మానవ స్త్రీని వర్ణించునటుల వర్ణించెను. పసికూనయగు జాంబవతి యుయ్యాల తొట్టిలో శమంతకమణి కట్టుట మానవస్వభావమునే తెల్పుచున్నది. శీత వాతాతప

---

* గంజాము, విశాఖపట్టణము (నేటి శ్రీకాకుళము) జిల్లాల యందున్నారు.

బాధల మాన్చుకొను వెఱవెఱుఁగక యెండకు నెండుచు వానకుఁ దడియుచున్నచో వికృతరూపము లలవడు టస్వాభావికము కాదు. నరులకు వానరులకు వివాహము జరుగుచున్న యపుడు వీరికిఁ దోఁకలెట్లు వచ్చును? మగ కోఁతులకుఁ దోఁకలుండుటయు, నాఁడకోతులకుఁదోఁకలు లేకపోవుటయుఁ దటస్థించెనందురా? వాలిడికోఁతులను జూచితిమి కాని యాడ మగ కోఁతులకు దోఁకలులేవు. కాన వానరులకు వాలములు గలవను పలుకులను మేము విశ్వసింపఁజాలము. నిజముగ నీ వానరులు మృగములే యగునెడల మనుష్యులకును, వీరికిని వైవాహిక సంబంధ మెట్లుండును? సంతాన మెట్లు సంభవించును! సుగ్రీవుఁ డన్నపైనున్న కసిదీర్చుకొనుటకై యుచితానుచితములు మఱచి శ్రీరామునకుఁ జెలిమికాఁడై హనుమదాదుల తోడ్పాటుచే రావణుని జంపించి లంకారాజ్యము రామునకుఁ గైవసముం జేసెను. "జ్ఞాతిశ్ఛేదన లేనకిమ్మ"ను నార్యోక్తి నీ యెడ మఱవఁదగదు. ఆర్యుఁడగు శ్రీరామచంద్రునకు సాయపడుటచే గ్రంథము లార్యకవులు వ్రాయుటచే వీరు దేవాంశ సంభూతులైరి. బ్రహ్మకూడ నరుఁడు గాఁబుట్టక వానరుఁడుగ నేలపుట్టవలయునో? దృష్టి దోషము తాకుననియా? లేక బుద్ధి జాడ్యమా?

## రాక్షసులు

బళ్ళారికి మిగుల దిగువనున్న దక్షిణా పథమంతయు మాంసభక్షకులగు ద్రావిడుల (అనఁగా రాక్షసుల) స్వాధీనమందున్నది. కిష్కింధా పురమునుండి లంకా దిగ్విజయ యాత్రకై శ్రీరాముండు బయలుదేరిన పిదప నెచ్చటను మున్యాశ్రమములు లోచనగోచరము కాలేదు. ఇందుచేఁ

గిష్కింధకు దిగువనున్న యరణ్యములను ఋషులు [అనఁగా] ఆర్యులు చొరనట్లు స్ఫుటమగుచున్నది. వానరరాక్షసులకుఁ గూడ సంఘర్షణ మత్యల్పము; సర్వప్రపంచ విజిగీషాపరవశుఁడైన రావణునకు నేవాలిచేతనో పరాభవమగుటతక్క పరస్పర వైషమ్యము లేదనియే చెప్పవచ్చును. వీరు సర్వసాధారణముగా వీరశైవులు. రామాయణ కథాకాలమునకుఁ బూర్వము వీ రార్యులచే సంపూర్ణపరాజితులగుటం జేసి ముఖాముఖి యుద్ధమునకుఁ దొడరక కన్నాటు యుద్ధమునకుఁ జొచ్చిరి. పురాణములయందుఁ బెక్కుచోట్ల వీరు దేవతాస్త్రీలను, రాచకన్నియలను బలాత్కారముగను, మాయవేషములతోడను, మోసగించియుఁ గొనిపోవుట నెఱుంగుదుము. ఈగతి పగతురకు మనోవైక్లబ్య మాపాదించుచుండిరి. వీరి వివాహములన్నియు బలాత్కార వివాహములుగనే యున్నవి. అందుచేతనే బలాత్కారవివాహములు రాక్షసవివాహములని పేర్కొనఁబడుచున్నవి. వేదాదులయందు వీరుదస్యులనంబడిరి. ఎదుటంబడి యార్యులతోఁబోరి గెలువంజాలక, రాత్రు లార్యుల పల్లెలపైఁబడి గందరగోళముఁజేసి యార్యయువతీ జనంబును హరించుకొనిపోవుచుండిరి. వేదములయందున్న దైవప్రార్థనలలోఁ జాలవఱకు నార్యులను దస్యులనుండి కాపాడు నిమిత్తమేర్పడినవి. వీరికి వైవాహికములున్నను, వీరియందు స్వైరవిహారధీరలు చాలమంది కలరు. అజవక్త్రియను రాక్షసికి వ్యభిచారమే యొకనోముగా నుండెనఁట. జరభీ సంతానము నింద్యముగాఁ బరిగణింపబడినదికాదు. ఈ కాలమున పరాజితుల భార్యలతోఁగూడ నిష్టువునంతయు స్వాధీనపఱచుకొనుట యాచారమై, ధర్మవిరుద్ధము కాదయ్యెను. ఈ

యాచారము వానరులయందుఁగూడ నున్నయది. ఇందు వల్లనే వాలి భార్య తారను సుగ్రీవుఁడుంచుకొనుట తటస్థించినది.

రాక్షసులలోఁగాని, వానరులలోఁగాని, యార్యులలోఁగాని షోడశవర్షాత్పూర్వము కన్యావివాహములు దలపెట్టుట యెఱుంగము. వినను లేదు. కనను లేదు. ఇట్టి యధర్మవివాహముల నాదేశించు మునిరూపశార్దూలురును లేరు. రామాయణ కాలమున నార్యులయందు దోషములుగాఁ బరిగణింపబడుచున్న యాచారములు వీరిచే హేయములుగా నెంచబడక యనుష్ఠింపఁబడుచున్నవి. వీరు మాంసభక్షకులు, సురాపాన ప్రియులు. కాని సురసేవ్యమానమగుటచే సురయయ్యోనేమో యూహింపఁదగియున్నది. రాక్షసులకు మానవులకు నిరాటంకముగా నుద్వాహములు జరిగియుండుటచేతను, నరమాంస భక్షకులని చెప్పఁజాలము. పైపెచ్చు రామాయణము రావణుని నరమాంసభక్షకునిగాఁ జెప్పియుండలేదు. ఆర్యులకుఁ బ్రత్యర్థులగుటంజేసి గీర్వాణకవులు వీరియెడ మాత్సర్య జనిత భావములను గుప్పియుందురు. ప్రహ్లాదునివంటిభక్తుఁడు, బలివంటి వదాన్యుఁడు, వృత్రునింబోలు తత్త్వవేత్త, హిరణ్యాక్షునివంటి రణనీతిబద్ధుఁడు, రావణునివంటి యంతర్వాణి యార్యులయందు సైతమెందరున్నారో ప్రేలుమడంచి లెక్కించినఁ దెలియనగు. రాజ్యకాంక్షచే సవతితల్లి గర్భస్థ పిండముల ఖండించిన క్రూరుఁడు, సోదరుఁడగు విశ్వరూపుని తలఁ దునిమిన నిర్ఘృణుఁడు, పూజ్యయగు మునిపత్నిని మోసగించి వ్యభిచరించిన నీచుఁడు, చేసినమేలు మఱచి ప్రాణదాతతో డీకొనిన కృతఘ్నుఁడు నయిన యింద్రుఁడు త్రైలోక్యపాల

కుండఁట. బలి హంతవ్యుఁడట ! ఇయ్యది సంస్కృత కవీంద్రదలేఖినీ మాహాత్మ్యముకాదా ?

రామాయణకాలమున రావణాసురుఁడు వీరి రాజేంద్రుఁడు. వీరికి లంకాపట్టణము గుండియ. త్రిశిరుఁడు మొదలగు వారలు ప్రతినిధులై దక్షిణాపథమునునేలుచుండిరి. దక్షిణాపథముననున్న యరణ్యసీమ శూర్పణఖ కరణముగా నిచ్చిన యుద్యాన వాటిక. తిరుచునాపల్లి యియ్యది నిజమని సాక్ష్యమిడుచున్నది. ఈ త్రిశిరుని ద్రావిడ నామము తిరుసీరు; ఈ తిరుసీరునే త్రిశిరునిగాఁజేసి సంస్కృత కవులు మనకు వీనిని మూఁడు తలల వానిగాఁ జూపించిరి. ఇట్టులే దశశాస్త్రనిష్ణాతుఁడయిన దశవదనుని బదితలల రావణాసురునిగాఁ జేసియుండిరి. ద్రావిడ శబ్దములను బెక్కింటిని సంస్కృత శబ్దములుగాఁ జేసియుండిరనుటకుఁ బెక్కుదాహరణములను జూపఁగలము. దీనిఁగూర్చి వేఱుగ్రంథమునఁ జర్చింపఁదలంచి యిట విడుచుచున్నారము.

రామాయణ కాలమునాఁటికి నార్యసంఘమునందుఁ బెక్కు మార్పులు గలిగెను. గోమాంసభక్షణము త్యజింపఁబడుటయే కాక దూష్యమనికూడ భావింపఁబడఁ జొచ్చెను. కాని మాంసభక్షణం బన్ని కులములయందు దినదినాభివృద్ధి గాంచుచునే యుండెను. "మధు సేవఁ జేయఁడు, మాంసంబు ముట్టఁడు." అను రామాయణ వాక్యము దీనికి సాక్షీభూతమగుచున్నది. కల్మాషపాదునియింట బ్రాహ్మణుండొక్కఁడు మాంసభక్షణముఁ జేసెనన్న భాగవతకథ దీనిని బలపఱచుచున్నది. ఇంత యేల ? కం॥ "పితృకార్య యజ్ఞ ముఖముల శ్రుతిచోదిత హింసఁ గీడు జొరనేరదు." అను భారత

నీతి యొక్కటియే మా వాక్యములను స్థిరపరచును సోమ
పానంబను మిషచేఁ గల్లుఁ ద్రావుట పవిత్ర కార్యముగనే
యున్నది. సోమలతరసమయినను, ద్రాక్షారసమయినను,
ద్రాటిరసమయినను, మద్యములే యగుటంజేసి మా యభి
ప్రాయమునఁ దుల్యములే. ఏతత్పూర్వము బహుళవ్యాప్తిలో
నున్న నియోగము గర్హ్యమై, నామమాత్రావశిష్టముగా
నున్నది. జీర్ణావస్థలోనున్న యీ నియోగమునే వ్యాసభట్టా
రకుండు పునరుద్ధరించెను. ఈషణ్మాత్ర భేదముతో నీ నియో
గము నేఁటికిని శ్రోత్రియులయందున్నది. వేదకాలమునుండి
యున్న యనులోమ, విలోమ వివాహములు మాయమై
యేక కులమునందే వివాహములు సంభవించుచుండెను.
యయాతి దేవయానులీయాచారమును దిరస్కరించి పెండ్లి
జేసికొనిరి. వారి సంతానము దూష్యము కాలేదు. బహు
పతిత్వము హేయముగాఁ బరిగణింపఁబడుటఁజేసి కానలమల్లా
డఁజొచ్చెను. "వ్యాసో నారాయణో, హరి" కరుణాకటాక్ష
మునఁ బాండవులు ప్రావడిన యీ యాచారమునకు జీవముఁ
బోసిరి. బహుపత్నీత్వము తప్పను నభిప్రాయము నప్పుడప్పుడే
మోసులెత్త సాగినది. ఇందుచేతనే రామాయణము నందు
రాముని యేకపత్నీత్వమునకు నవసరమయినంత ప్రాముఖ్య
మొసంగబడినది. తుట్టతుదకీ యేకపత్నీత్వమే రాముని నవ
తార పురుషునిగాఁ జేసివైచినది. వైవాహిక ధర్మముచ్చ
స్థానమలంకరించినది. కాని యనులోమ వివాహములు నిరా
ఘాటముగా జరుగుచునే యున్నవి. ఒక్క వసిష్ఠుని వంశముఁ
దీసికొని విచారించినయెడల సత్యము బోధపడగలదు. వశి
ష్ఠుఁడు బ్రాహ్మణుఁడు. భార్య యరుంధతి మాల; కుమా

రుండు శక్తిమహాముని, తద్భార్య పుంగనూరు మాదిగ; శక్తి మహాముని కుమారుఁడు పరాశరుఁడు, భార్య బోయ; చాల బ్రాహ్మణ కుటుంబము లిట్లున్నట్లే పొడకట్టుచున్నవి. కాని నేఁటి బ్రాహ్మణులు బ్రహ్మముఖమునుండి యూడిపడితిమను చున్నారు. వంశవృక్షమును బరిశీలించిన యెడల నెక్కడ నుండి యూడిపడినది తెలియఁగలదు. సాంఘిక దౌర్జన్యము మతము నొకమూలకుఁ బారఁద్రోలుటచే నాముష్మిక చింత రెండవది యైనదని చెప్పసాహసించుచున్నాము. వారి పేరున, వీరి పేరున, దొంగస్మృతులు వ్రాయుటిప్పుడే యారంభమైనది. ఈ వ్రాతలకుఫలముగా శ్రీరామచంద్రుఁడు "కృశాంగున్, నిరాహారున్ శోణజటాచ్ఛటాధరు మహోగ్రాచారు నేకాగ్రతా పారీణాత్మ నధోముఖున్ భసితశుంభత్పాండుర శ్రీనిధిన్, ధీరత్వాకరు, జీరధారు, దీవ్యత్తపస్యాన్వితున్," అయిన శంబుకుని శూద్రుఁడని యనుకంపాశూన్యుఁడై, కత్తికి బలి యిచ్చెను. నేఁటివలె వరుఁడు వధువునకన్నను బెద్దవాఁడుగా నుండవలయునను నియమములేదు; శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవి కన్నను జిన్నవాఁడు. 'పదియేనేడుల బాలుఁడు' 'కాకపక్షసంయుతుఁడు' అగు రాముఁడు తరుణవయస్క యగు సీతను బెండ్లియాడెను. పంజాబు క్షత్రియులయం దమ్మలక్క లిట్టి పెండ్లిండ్ల నుబుసుపోకకుఁ జెప్పికొనరు. ఇట్టి వివాహ మొక్కటి మే మెఱుంగుదుము.

ఈ కాలంబున నార్యులు రాజకీయవిషయంబులం దపారవై దగ్ధ్యంబును, గౌశల్యంబును గడించిరి. నయవర్త్మ మూసనుబడెను. తంత్రము విస్తరించెను; కౌటిల్యమును బ్రకటించియైన నభీప్సితంబులఁ బొందుటకు వెనుదీయరైరి. ఋషు

లకుఁగూడ రాజ్యరక్షణమే పరమావధియయ్యెను. ప్రత్యేక వ్యక్తి నశించి యంతయును రాజునందు మూర్తీభవించెను. రాజు "నావిష్ణుఃపృథివీపతి" యయ్యెను. పొట్టకూటికై యార్యులు దేశభ్రమణంబుమాని పల్లెలంగట్టుకొనిరి. పల్లెలెల్లను బట్టణంబులుగా మారెను. భిన్నరాష్ట్రము లేర్పఱచికొని రాజులు ప్రజానురంజకముగా నేలుచుండిరి. భూమి నదీమాతృకయగుటంజేసి, 'అకృష్టపచ్యా ఇవసస్యసంపద' ప్రజలను సంతృప్తులను జేయుచుండెను. జార చోర భీతిలేక రాష్ట్రములు నిత్యకళ్యాణము, పచ్చతోరణములుగఁ జెలఁగుచుండెను.

సూర్యవంశ మార్యులయందు మిగుల మన్నింపఁబడుచుండెను. సూర్యవంశ్యులకు సాకేతంబు (అయోధ్య) రాజధాని; ఉత్తరహిందూస్థాన మిట్టిస్థితియందుండ శ్రీరామభద్రుఁడు సాకేతపుర సింహాసనాసీనుఁడయ్యెను. ప్రాచీనకాలంబున రాజును దేవునిచే మతప్రచారంబునకుఁ బంపఁబడుదురను విశ్వాసముండెను. ఇందుచే రాజ్యతంత్రమునందు మత సంబంధికులకు నపరిమితాధికారము చేఁజిక్కెను. దీనిఫలముగా వైదికులు మంత్రులైరి. ఇయ్యది యితరదేశ చరిత్రములయందు నిస్సంశయముగాఁ జూడనగును. రోమక సామ్రాజ్యమున "పోపు"నకున్న నిరంకుశాధికారము విస్మయజనకము; చిరకాలము క్రిందట "ఇంగ్లీషు" రాజ్యమున మత సంబంధికుఁడయిన "ఛాన్సలరు" ముఖ్యమంత్రియగుటయే గాక యప్రతిహతాధికారము చెల్లించుకొనెను. ఈవిధముగ శ్రీరామచంద్రునకు మతగురువగు వశిష్ఠాదులు మంత్రులైరి. గురువెట్టివాఁడయినను గురుతిరస్కారము శిష్యధర్మము

కామించే దుదకు శ్రీరామచంద్రుండు వశిష్ఠునిచేతిలోఁ గీలు బొమ్మయయ్యెనని చెప్ప సాహసించుచున్నాము. ప్రతిపక్షము బలహీనమైనకొలంది బ్రాహ్మణులు భూదేవులయిరి. ఆర్య జాతి విజృంభణమునందు నీకాలము కృతయుగమని మా యభిప్రాయము. ఈవిషయమున మేము పూర్వమహాపురుషుల నుండి భిన్నులమైతిమని యెఱుంగుదుము. ఇప్పటినుండి యార్యజాతి పతన మారంభించి భారతయుద్ధమున ముగిసెను. ఇందనుక మనము జాగరూకులమై యార్యులచరిత్ర పరిశోధన బుద్ధితోఁ జదివితిమేని, జాతియొక్క క్రమక్రమాగతాభివృద్ధి (evolution) స్పష్టపడును. ఒక కాలమున వివాహము లేకుండ * పుత్రవతి యగుట హేయముగా నుండెను. ఇట్టిది దోష దూషితము గాకుండుటకు గాను నమంత్రకమైన గాంధర్వ వివాహ మొక్కదాని నంగీకరించిరి. నేటికి దక్షిణాపథము నందలి యడవిజాతుల యందున్న వివాహములలోఁ బెక్కులు గాంధర్వవివాహములే. ఒకకాలమున సంతానప్రాప్తికై పెర భార్యను దెచ్చికొనుట హేయముగా నుండెను. వేఱొకకాల మున బహుపత్నీత్వము నింద్యముగా నుండెను. కొండొకకాల మున బహుపతిత్వము గర్హ్యముగాకుండెను. కాని విజ్ఞానవివే కము కన్నులఁ దెరచినకొలఁది యీ యారతారలన్నియు నశించినవి. ఇదియే మన మెఱుంగఁదగినది.

ద్రావిడులు వానరులు, రాక్షసులనుమాటయు నార్యులు దేవాంశసంభూతులను మాటయుఁబోయి మాన వులే యను నభిప్రాయమిప్పుడే మోసులెత్తెను.

---

* సత్యవతి మొదలగువారు.

## ఇదానీంతనము. రామాయణకాలానంతరము

రావణవధానంతరము హనుమదాదులు సాకేతపురంబును ప్రవేశించుటఁజేసి దక్షిణోత్తర హిందూస్థానములకు రాకపోకలు తఱచై యార్యసంపర్కము వృద్ధియయ్యెను. హనుమదాదులు జన్మభూమినివిడిచి సాకేతపురంబుఁజేరి ఋషులపాదములువట్టి యాధ్యాత్మికవిద్యయందుఁ బాండిత్యము సంపాదించిరి. దక్షిణాపథము మ్లేచ్ఛభూమియనుమాట మఱచి ఋషులిచ్చటకు రా మొదలుపెట్టిరి. ద్రావిడులలోఁ గొంచెమో, గొప్పయో, జ్ఞానముకలవారు ఋషుల పరిచయముం గలిగించుకొని వారి యాచార వ్యవహారములను బట్టులవలెఁ బొగడుచుఁ దమహీనస్థితిని నొప్పుకొనుచుఁ దదాచారములను స్వీకరింప మొదలిడిరి. ఇట్లు మొట్టమొదట తమజాతినిఁదెగడి యార్య నాగరకతకు దాసానుదాసులై తల లొగ్గినవారు బ్రాహ్మణులయిరని మాయాశయము. నేఁడు మాలలలోఁగొందఱు మతము (అనఁగా క్రైస్తవమతము) పుచ్చుకొన్న యనంతరము కొందవమాలలు చీకటిలోనున్నారనియుఁ, దాము వెలుతురులోనికి వచ్చితిమనియు నిరసంపుఁజూపులతోఁజూచుట మనము కాంచుచునేయున్నాము. ఇట్టిదియ యీయెడ సంభవించినది. ఇప్పటికిని దాక్షిణాత్య బ్రాహ్మణులకును, నౌత్తరేయ బ్రాహ్మణులకును జాల భేదముగలదు. చూచిచూచుటతోడనే యెవ్వారెవ్వారో మనము గ్రహింపవచ్చును. ఆర్యుల నాగరికత యవలంబించిన పిమ్మట యార్యులతో సంబంధబాంధవ్యములు తటస్థిం

చెను. అనఁగా సాంకర్యము కలిగెను. ఇందుచేతనే బ్రాహ్మణులవర్ణము (శరీరచ్ఛాయ) నందంత తారతమ్యములు కనుపట్టుచుండును. ద్రావిడులుష్ణ ప్రదేశవాసులగుటచే నీలవర్ణులు. ఆర్యులు శీతలదేశవాస్తవ్యులగుటచే శ్వేతాంగులు. ఈ పచ్ఛోణసమ్మిశ్రితమైన తెలుపునకు "బాపనవెల్ల యని" ప్రాకృతజనంబు నేఁడును వ్యవహరించుచుండును.

ఈ నడమంత్రపు బ్రాహ్మణు లార్యులతోఁ జుట్టరికంబు వృద్ధియైనకొలఁది ద్రావిడులపొంతువ లంతముఁ జేసికొన సమకట్టి కొంతవరకు సఫలీకృత మనోరథులైరి. మధ్యవైష్ణవులకు నామాలు మెండన్నట్లు ఆర్యులయందులేని కొన్ని నూతనాచారములను క్రొత్తగాఁ జేలియేర్పడిన తమ సంఘమునందుఁ జొప్పించిరి. ఈకారణముననే దృష్టిదోషము, మితిమీరిన నిష్ఠ, ఒకరినొకరు తాకకుంట మొదలగు వెఱ్ఱియాచారములు తామరతంపరసరణి వృద్ధిఁబొందినవి. కాన రక్తమున కెక్కని శాకభక్షణంబుమాని యార్యులఁబోలె మాంసభక్షకులు కారైరి. శాకభక్షణ ద్రావిడులయందు మిగుల వృద్ధియందున్నది. ఇందుచేతనే తెలుఁగు దేశమునందుఁ గోమటులు, నఱవదేశంబున వీరశైవులు శాకభక్షకులుగనే మిగిలియున్నారు. శాకభక్షణము, వీరశైవము ద్రావిడ సంప్రదాయసిద్ధములు. కలంకమున్నయపుడే నిష్ఠయు, నావేశము నధికమగును. పశ్చిమతీరమందున్న "మాపిళాలు" అరేబియా మహమ్మదీయులకన్నను, నిష్ఠాపరులుగను, నావేశపరులుగను నున్నారు. ఆర్యమతముగాని, తన్నాగరికతగాని చేపట్టని వారలను నవలకుఁదఱిమి నీచముగాఁ జూడనారంభించిరి. వీరికి మాతృభాషలు (అనఁగా తెలుఁగు, అఱవము

మొదలగునవి) అనాగరక భాషలైనవి. నూతనమతస్వీకారముచే సంస్కృత మత్యావసరమగుటచేఁ దద్భాషాపరిచయమునకై పట్టుఁదలఁ జూపఁ బ్రారంభించిరి. ద్రావిడబ్రాహ్మణు లిందు చేతనే యౌత్తరేయ బ్రాహ్మణులకన్నను నత్యద్భుత గీర్వాణ భాషాపాండిత్యమును సంపాదింపఁగలిగిరి. కాలక్రమమున నీసంస్కృతము వంశపరంపరగా సంక్రమించిన ముల్లెయని భావింపబడెను. సంస్కృతభాషాజ్ఞానముగలిగిన వీరికిఁ దెలుఁగు భాష, కోయ, చెంచు భాషయైనది. సంస్కృతభాషానభిజ్ఞులు మోటువారలు, పశుప్రాయులైరి. క్షణకాలమైనను వీరికిఁ దెలుఁగవసరమను నూహ మనంబునకుఁ దట్టలేదు. గాసట బీసటయై యనాగరిక సేవ్యమానమైన తెలుఁగును నాగరక జనోపయోగముం జేయుట యుచితమని కొందఱు మహాను భావులకుఁ గోరిక పొడచూపినది. సంస్కృతశబ్దసంచితమైనఁ గాని పూజ్యముకాదనియెంచి మహామహుఁడు నన్నయ చెలి యలికట్ట బ్రద్దలుగొట్టి సంస్కృతశబ్దజాలఝురిని తెలుఁగు దేశముమీఁదికి విడచెను. విడచినయనంతరము సంస్కృత శబ్దములను వ్రాయుటకుఁ దెలుఁగు వర్ణసమామ్నాయము చాలక కొఱవడి యుండెను. ఈ కొఱత తీర్చుటకుఁ దెలుఁగు లిపికి 'ఒత్తు' అక్షరములు చేర్పఁబడియెను. ఇంతకును ఫల మేమి? తెలుఁగుదేశమంతయు వరదపాలయ్యెను. విస్మయ చిత్తుఁడై చెలియలికట్ట యవసరమని తలపోసి నన్నయ్య గంటముఁ దీసికొని 'ఆంధ్రశబ్దానుశాసనంబును' సంస్కృతం బున రచించెను. తెలుఁగు వ్యాకరణము సంస్కృతంబున రచింపఁబడె. ఏమివింత! ఏమిచిత్రము! ఈ పిచ్చి యింతటితో ముగిసెనా? లేదు. తరువాతివారలుకూఁడ గొంతకాలము

పఱకుఁ దెలుఁగు వ్యాకరణములు సంస్కృతమునందే వ్రాసిరి.

సనాతనధర్మమును సంపూర్ణముగా గ్రహింపఁజాలక పోయినను 'అంకమ్మ, పోలేరమ్మ' గుడులను బాడువడఁజేసి యా స్థానములయందే సీతారాములకు హనుమదాదులకు గుడులు, గోపురములుకట్టించి ద్రావిడులు సంపూర్ణముగా హిందువులమైతిమని యానందించుచున్నారు. తమ సంఘము నుండియే, తమ యెట్టయెదుటనే యార్యమతము స్వీకరించి కొందఱు "బ్రాహ్మణోము ఖమాసీత్" అను పదవిని బొందుటజూచి కన్నుఁగుట్ట, మఱికొన్ని ద్రావిడాంతశ్శాఖ లార్యసంఘముతో నేకీభవించుటకు నహమహమికఁ జూప మొదలిడెను. ఇందు మొదటివారలు కంసాలులు. వైదిక బ్రాహ్మణులఁ దలఁదన్ని పుట్టితిమనియుఁ దామే సద్బ్రాహ్మణులమనియు వాదించుచు ద్రావిడనామమును త్యజించి 'విశ్వబ్రాహ్మణ' యను సంస్కృతనామమును వహించిరి. విద్యాహైన్యముచేతను, దారిద్ర్యముచేతను, వీరియభీష్టము కొనసాగమికి మిగుల జింతించుచుంటిమి. మఱియొక యంతశ్శాఖ దేవబ్రాహ్మణులైరి. వీరినందరిజూచి చేతిలోనిలాభము పోయెఁబోయెనని చెప్పి రేకెత్తి కోమటులార్యసంఘద్వారములను తెఱచి లోనికిబోవఁ దహదహలాడుచుండిరి. కోమటిశబ్దమును దిగద్రొక్కి "ఆర్యవైశ్యులు" అను సంస్కృతపుఁ బేరు దాల్చి యార్యులమనుకొనుచుఁ దమస్థితిగతులను బాఱఁ జూచుకొనుసరికిఁ బెద్దయాటంకము పొడచూపినది. అనుములు, మినుములు, పెసలు, పిప్పళ్లు గోత్రముల జూచి కొందఱు సంస్కారప్రియులు కోమటిశబ్దమును "ఆర్య వైశ్య" చేసినయట్టు లీగోత్రములు సాంకేతికములని చెప్పి యాంగిరస

భరద్వాజ ప్రముఖ బ్రాహ్మణ గోత్రములకు మార్చివైచి కొని యార్యసంఘమునందుఁ జేరుటకు ముస్తాబయి కూరు చుండిరి. దీనినంతయుఁ బరిహాసమునకు వ్రాయుటలేదు. పైపెచ్చు వీరి సముత్కంఠ గొనియాడుచుంటిమి. చారిత్రక విషయమగుటచే వ్రాయవలసినవార మైతిమి. తుదకీరోగము వెలమ, కమ్మవారికిఁగూడ సోఁకినట్లున్నది. వీరార్యక్షత్రియుల మనుకొనుచున్నారు. విస్తరభీతిచే నీ యంశమును స్థాలీపులాకన్యాయమునఁ జర్చించి క్లుప్తీకరించవలసిన వార మైతిమి.

ఆంధ్రదేశ మార్య ద్రావిడ నాగరికతా సంఘట్టన స్థానమగుటచేఁ దెలుఁగు జాతులలోఁ గొన్ని సంకరములని చెప్పవచ్చును. ఆర్యమత స్వీకరణముఁజేసి యార్యుల మైతిమని యనుకొను నీ దిగువ ద్రావిడ జాతులను బరిశీలించినచో మా వాక్యములయందలి సత్యము మనస్సునకుఁ దట్టకపోదు. ఆరామద్రావిడులను, నంబితంబళులను, వైష్ణవ, వైదిక నియోగులయందుఁ గొందఱిని, నఱవ కన్నడ బ్రాహ్మణులను బరిశీలించిన యెడల జాతి సాంకర్యము బోధపడకమానదు. వెలనాటి పూజారులను గోమటులను, గంసాలులను, జూచిన యెడల నన్యమత స్వీకరణముచేఁ గల్గిన యార్యత్వము విస్పష్టము కాకమానదు.

ఆర్య బ్రాహ్మణుల నింకను మాంసభక్షణంబు వదల లేదు. వంగదేశ బ్రాహ్మణులు, నోఢ్రబ్రాహ్మణులు మత్స్యభుక్కులు; కనోజి బ్రాహ్మణులు, మహారాష్ట్రులయందు సారస్వత బ్రాహ్మణులు మాంసాహారులు; పంజాబీ బ్రాహ్మణులయందుఁ గొందరు మాంసాహారులు. వీరందఱును బంచ

గౌడులలోనివారు. తెలుఁగు దేశమునందుఁ దూర్వ్వకంసాలులయందు మాంసభక్షణంబు ముసుఁగులో నున్నయది. ఒకవేళ నిది యాంధ్రదేశపు సహవాస దోషమేమో? ఆర్య ద్రావిడ వర్ణవిభాగ మీ దిగువ నుదహరించు చుంటిమి. పాఠకులు జాగరూకులై పరిశీలింతురుగాక.

| ఆర్యులు. | తద్ధర్మము. |
|---|---|
| 1. బ్రాహ్మణులు:— | భగవత్పూజా విధానము. (యజ్ఞ యాగాదులు చేయుట, చేయించుట.) |
| 2. క్షత్రియులు:— | పరిపాలన (చాతుర్వర్ణ్యధర్మములు సాంకర్యముఁ బొందకుండఁ గాపాడుట) |
| 3. వైశ్యులు:— | కృషి వాణిజ్యగోపాలనము (ఈ మూఁడు జాతులు ద్విజాతులు) |
| 4. శూద్రులు:— | త్రైవర్ణిక శుశ్రూష. |

వీరు మత సాంఘికస్వత్వబహిష్కృతులు. వీ రార్యులు కారు ;పరాభూతులయిన ద్రావిడులు. కావుననే యార్యులకు సేవకులుగా గ్రహింపఁబడి సేవాధర్మము వీరికి విధింపఁబడెను. ఇంతియకాక త్రైవర్ణికులకు వర్ణసాంకర్యమునఁబుట్టిన వారలు గూడ నిందుఁ జేర్పఁబడిరి.

## ద్రా వి డు లు

| వర్ణవిభాగము. | తద్ధర్మము. |
|---|---|
| వెలమ, కమ్మ, రెడ్డి, కాపు మొదలగువారు | క్షత్రియ ధర్మము. అనఁగా శస్త్రజీవనము, పరిపాలనము. నేఁడు తెలుఁగు దేశమునందున్న జమీనులే దీనికి సాక్ష్యము. వైశ్యధర్మము |

లోఁ గొంతభాగము, కృషి గోపాలనము.

2. గొల్ల, పల్లి, కుమ్మరి, మొదలగువారు — బ్రాహ్మణ ధర్మము-అనఁగా దేవరల గుడులయందుఁ బూజారితనము.

3. కోమటి, బలిజ, సాలి, మొదలగు జాతులు — వైశ్య ధర్మములో నొక భాగమయిన వాణిజ్యము.

4. కాసా, బోయ, చాకలి, మొదలగు జాతులు — సేవా ధర్మము.

ఆర్యుల యందలి వర్ణవిభాగమునందు బ్రాహ్మణులు ప్రథమస్థాన మలంకరించి తదితర జాతులకు బోధ్ధలుగానుండి యన్నివిధములగు హక్కుల ననుభవించుచున్నారు. బ్రాహ్మణ పాదోదకము పాపహరమనియు, బ్రాహ్మణ భుక్తశేషము మోక్షదాయకమనియు, నభిప్రాయముఁ గల్గించిరి. క్షత్రియులు రెండవ స్థానమును, వైశ్యులు మూఁడవ స్థానమును, నాక్రమించుకొని యున్నారు. వీరందరు ద్విజులు. ఈపద్ధేదములో వీరికి సమానస్వత్వములు గలవు. స్వజాతివారు కాకపోవుటచే శూద్రులనంబడువారు కొంచె మించుమించుగా బానిసలుగనే యున్నారు. వీరికున్న హక్కులు నామమాత్రములు.

ద్రావిడ వర్ణ వివక్షతయందు శస్త్రజీవులైన వెలమ, కమ్మ మొదలగువారగ్రస్థానమును, వాణిజ్యజీవులగు కోమటులు మొదలగువారు రెండవస్థానమును, గొల్ల, కుమ్మరి

♦ నేఁడు కాసాలు తెలగవారమని చెప్పుకొనుచున్నారు.

మొదలగు బ్రాహ్మణ ధర్మాఢ్యులు మూఁడవ స్థానమును, బోయ మొదలగు సేవాధర్మపరులు నాలుగవస్థానమును, గైకొనియుండిరి. ఈ వర్ణవివక్ష కొందఱికి విస్మయజనకము గావచ్చును. కోమటులను వెలమ, కమ్మవారి తరువాత నుని చితిమని యార్యవర్ణవిభాగ మెఱింగినవారనవచ్చును. అఱవ దేశము ద్రావిడదేశమగును. కాన నఱవదేశంబునందున్న యాచార వ్యవహారములను బట్టియే వర్ణవిభాగములను నిర్ణయింపవలసియుండును. ఆ దేశంబున వెలమ, కమ్మవారలు కోమటుల యిండ్లకడ పుడిసెలినీరమయినను ద్రావరు. ద్రావిడ వర్ణవిభాగంబును దిలకించినయంత వెలమ కమ్మవారలు క్షత్రియులమనియుఁ గోమటు లార్యవైశ్యులమనియుఁ జెప్పుకొనుటకుఁ గలహేతువు సులభైకవేద్యము. ♦ వైశ్యధర్మములలో నొకటియగు వాణిజ్యమును బూనిన కోమటులు వైశ్యుల మనియు, క్షత్రియ ధర్మమయిన శస్త్రజీవనము దాల్చుటచే వెలమ కమ్మవారలు క్షత్రియులమనియు, ననుకొనఁదొడంగిరి. ఇంతియకాని యే పరశురామునినో లేక యే పరశురాముని మగనినో కాంచి బెగ్గిలి యదివఱకున్న జందెములను ద్రెంచివైవలేదు. వీరు బాపనిఁ జూచిన యంత మాత్రముననే మగబీరమును డించి మూలముడుంగునంతటి భీరువులు కారు. విక్రమావష్టంభమున దిక్తటముల బీటలు వారించిన వీరు బ్రాహ్మణునికి భయంపడి యుపనయనాది సంస్కారములను వదలి శూద్రులై పోయిరనుట కన్నఁ బరిహాస

♦ తెలుఁగునాఁడు "ఆర్య ద్రావిడ నాగరిక సంఘట్టన స్థానమగుటచేఁ గోమటులార్యత్వము చప్పున గ్రహింపఁగల్గిరి.

మేమి కావలయును ? అట్టివారి సంతానమని చెప్పుకొనుట
కయిన సిబ్బితిలేదా ? ఆర్యులకు యజ్ఞోపవీత ధారణము
మత సంబంధమైన కార్యము. వీరి యాచార వ్యవహారముల
నవలంబించిన దక్షిణాపథము నందున్న బ్రాహ్మణులు, విశ్వ
బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు, బట్రాజులు, సాలీలు,
మొదలగు వారలప్పుడు జందెమును మెడకుఁ దగిలించుకొనిరి.
నేఁడు కమ్మవారు నిటులే యజ్ఞోపవీతధారులగుచున్నారు.

## లంకాద్వీపము

రామాయణము ప్రకారము లంకాద్వీపము హిందూదేశ
మునకు శతయోజన దూరమందున్నది. యోజన మనఁగా
నేమి ? భాస్కర రామాయణమునందు "యోజన" శబ్దము
"ఆమడ"గా భాషాంతరీకరింపఁ బడినది. ఈ యామడ
వెవ్వేఱుచోటుల, వెవ్వేఱుగా నున్నది. తుదకుఁ గొంద
ఱెనిమిది మైళ్ళన్నఱగా సిద్ధాంతీకరించినారు. దీనిం బట్టిచూడ
లంకా ద్వీపము హిందూదేశమునకు నెనిమిది వందల యేఁబది
మైళ్ళ దూరమునందుండవలయును. కాని యట్లు లేక యిరు
వది మూఁడు మైళ్ళన్నఱలో నున్నది. ఈ తారతమ్యమును
సమర్థించు టెట్లు ? యోజన శబ్దమునకు వే ఱేమయిన నర్థ
మున్నదేమో తెలిసికొనవలసి యున్నది. మహాపండితులను
గొందఱి నడిగి యుంటిమికాని వారు చెప్పిన యర్థములయం
దొక్కటియు సరిపోవక పోవుటచే నామడయను నర్థమే
సమంజసమని నిర్ధారింపవలసిన వారమైతిమి. ఇంకెట్లు దీనిని
సమర్థించుట ? వాల్మీకి మహాముని దక్షిణాపథ మెఱుంగని
వాఁడగుటచే, వారివలన, వీరివలన విని పొరపడియుండునని

చెప్పి రామభక్తులకుఁ గోపము రగుల్పవలసి వచ్చి నందులకు మిగులఁ జింతించుచుంటిమి.

కడుంగడుఁ బూర్వకాలమున లంకా ద్వీపమునకును హిందూ దేశమునకును మెట్టదారి యొకటుండి దాని మూల మున దక్షిణ దేశ పశువులు "పుల్లరి" మేతకై లంకకుఁబోవు చుండెననుటకుఁ బెక్కు దృష్టాంతములు కలవు. రామాయణ కాలము నాఁటికి సంతతసముద్రోత్తుంగ తరంగ సంఘట్టితంబ గుటచే సింహళమును, నీ దేశమును గల్పుచున్న యీ మెట్ట దారియందు గండ్లుపడి యుండెను. నీలుఁడను ద్రావిడ శిల్పి వానరుల సాయమునను, శ్రీరామచంద్రుని యాజ్ఞచేతను గండశిలలచే నీగండ్లనే పూడ్చి దారిని బలపఱచి భద్రముగాఁ జేసెను. ఇదియే సేతువని జగత్ప్రఖ్యాతి గాంచెను. రామా యణమున నీ కథను వాల్మీకిమహాముని కుంచె కోలతోఁ బెక్కురంగుల వైచెను. నేఁడు నీలుఁడు వేసిన ఱాళ్ళు, అప్పలు కొట్టికొని పోవుటయేకాక, కడలతాకుచే మిగిలిన కట్టకూడఁ గొట్టుకొనిపోయి సముద్ర మీావలావలికిఁ బొరలిపోవుచున్నది. పొరలిపోవు చున్నది సుమీా. పెద్ద పెద్ద నావలు నిరపాయముగా నీ మార్గమునఁ బోవఁజాలవు.

శ్రీరామయణమునం జెప్పబడిన సువేలము, త్రికూ టము, సుమనఃకూటము లంకా ద్వీపమున నేఁటికిని నిలిచి యుండి రామజైత్రయాత్రను వేనోళ్ళఁజాటుచున్నయవి.

## యక్ష నాగ లోకము లేవి?

యక్షశబ్దము సంస్కృతము. దీనికిఁ బ్రాకృతము "ఎక్కలు." తద్భవము (తెలుఁగు) జక్కులు. సింహళ ద్వీప మునందు వాడుకలోనున్న భాష పాళి. ఇది ప్రాకృత భాష.

కాన సింహళమునందు యక్షులు, "ఎక్కల"నియుఁ, దెలుఁగు దేశమునందు జక్కలనియుఁ బిలువంబడు చున్నారు. సింహళ దేశము యొక్క యాదిమవాసులు "ఎక్కల"ని తచ్చరిత్రలు విస్పష్టముగాఁ జెప్పుచున్నవి. రావణుఁడు లంకా ద్వీపముఁ బ్రవేశించి దొమ్మియుద్ధమున యక్షరాజయిన కుబేరునోడించి యుత్తర దిక్కునకు నసఁగా మలయాలమునకుఁ దోలకమున్ను లంకాద్వీపము యక్షలోకముగా వ్యవహరింపఁ బడుచుండెను.

భారతమున సమయవిరుద్ధముగా ధర్మజద్రౌపదీ మందిర ప్రవేశముఁ జేయుటచే భూప్రదక్షిణముఁ జేయవలసి వచ్చిన విజయుఁడు (అర్జునుఁడు) ప్రభాసతీర్థమున నులూచి యను "పాఁపజవరాలి"చేఁ బాతాళమునకుఁ గొనిపోఁబడె ననియు నట నులూచిని వరించి యిలావంతుఁడను కుమారునిఁ బడసెననియు మన మెఱుంగుదుము. ఈ కథనే సింహళద్వీప చరిత్రలు మఱియొక విధముగాఁ జెప్పుచున్నవి. విజయుఁడను నుత్తర హిందూస్థాన వాస్తవ్యుఁడు సహచరులతో నొక సరస్సీరమునసుండఁ గువేణియనునొకయక్షిణి విజయసహచరులను మోసగించికొనిపోవ నెట్టులో సాధించి విజయుఁడు కువేణిని బట్టుకొని చంపఁబోవఁ దన్నుఁబెండ్లాడిన సహచరుల నిత్తునని చెప్పఁగాఁ బెండ్లాడి యనంతరము యక్షలోకము నంతయు జయించి రాజ్యమేలె ననియు, నీ దంపతులకు నొక కుమారుఁడు, కుమారియుఁ గల్గిరనియు సింహళద్వీప చరిత్రకారులు చెప్పుచున్నారు. ఇచ్చట హిందూదేశ చరిత్రకారులు యక్ష నాగలోకములను గలగూరగంపఁ జేసిరని మేమభిప్రాయ పడు చుంటిమి. దీనికిఁ దగు కారణముకూడఁ గలదు.

సింహళ ద్వీపముయొక్క యుత్తర భాగమును నాగ

ద్వీపమనియు, నాగులను నొక జాతివారచట వాసముఁజేయు చుండిరనియు సింహళద్వీపచరిత్రల వలనఁ దెలియుచున్నది. మలయాళ దేశమునందున్న "నాయరు" అను జాతివారచటకు వలసపోయిరనియు, వారలే నాగులై రనియుఁ గొందఱు వాదించుచున్నారు. ఈ యిరుతెగలయం దాచారసామ్యము కలదు. ఈ భేదము బాగుగా గుర్తెఱుంగని మన గ్రంథకర్తలు మనము "ఇంగ్లీషు" వారిని హూణు లనుచున్నట్లే, యక్షులను నాగులను జేసియుందురని తలపోయుచున్నాము. ఈ యక్షులిప్పటికి నీ లంకాద్వీపము నందున్నారు. నాగరికత లేని యాటవికులు. వీరలను మేము చూచితిమి. మన కోయ, చెంచు వాండ్రకన్నను హీన స్థితి యందున్నారు. వీరల నిప్పుడు "ఎడ్డులనియు, ఎడ్డి మనుష్యులనియు" బిల్చుచుందురు. ఈ రెండు శబ్దములును వ్యాధశబ్దభవములు. మన దేశము నందున్న జక్కులు వీరికి సంబంధించిన వారేమో చూడ వలసి యున్నది. వివాహము లేకుండుటను, బడుపువృత్తికల్గి యుండుటనుబట్టి చూడ మా శంక నిజమగునేమో ! యక్షులు వివాహ మెఱుంగరు. ఇప్పుడు నాగలోకము లంకాద్వీపోత్తర భూమి యనియు, యక్షలోకము లంకయనియుఁ దెల్లమగు చున్నది. ఈ యంశమును విపులముగాఁ జర్చించి పెక్కు దృష్టాంతములు చూపింపవలయునని మనంబున్నను విస్తరభీతి మమ్మందులకుఁ జొఱనీకున్నది.

## రా క్ష సు లు, రా వ ణు ( డు.

వీ రార్యులకుఁ బ్రత్యర్థులు; తమ జన్మ భూమియగు నీ హిందూ దేశమును నార్యులు ప్రవేశించి, యాక్రమించు

కొనుటఁజూచి సహింపఁజాలక వారలను దఱిమి వేయుటకు వివిధ ప్రయత్నములు చేసి విఫలీకృత మనోరథులై, విజితు లయిరి. వీరు వీర శైవులు. వీర శైవులకు జీవహింస సంప్ర దాయ విరుద్ధము. హింసాప్రపూర్ణములగు యజ్ఞ యాగాదులను వీరందుచేతనే మాన్పించు చుండిరి. అందు రావణుఁడత్యంత శైవభక్తుఁడగుటం జేసి, దీనిని నాచరణము లోనికిందెచ్చెను. అందుచేతనే జగత్కంటకుండని రామాయణముచేఁజెప్పించిరి. రావణుఁడీ పశువధ మాన్పుటకుఁగాను భక్తి ప్రపత్తి పరవశ యగు తాటకిని దండకారణ్యమున నుంచెను. ఈ తాటకి దండకారణ్యమున విశ్వామిత్ర యజ్ఞవిఘ్నకారిణి యగుటయు, శ్రీరామచంద్రుఁడు దునుమాడుటయు మన మెఱుంగుదుము.

తాటకి ప్రపత్తి సంపన్న. తిరువడ మరుదూరునందు నీమెకు నింకను దేవాలయమున్నది. ప్రభాతముననే లేచి వన వాటికరిగి, స్వహస్తముతో పుష్పాపచయముఁ గావించి, శివుని సన్నిధిని నొక మాలనుగూర్చి శివునికర్పించుట యీమె యాచారము. శివుఁడీమె భక్తి పరీక్షింప నెంచి మాలికా నిర్మాణముఁ జేయునప్పుడు సర్వ విషజంతు దష్టము గావిం చెను. భగవద్ధ్యానమున లీనమయిన యీమెకు నీ బాధ యేమియుఁ జేయనేరదయ్యె. పూదండగ్రుచ్చి శివుని మెడలో వైవలేచినప్పుడు శివుఁడింకను బరీక్షింప నెంచి యీమెను నగ్నను గాఁ జేసెను. భక్తిపరవశయైయున్న యీమె దీనిచే నొకించుక చలించి చేతనున్న పూదండను వదలనొల్లక సంకు చిత దేహయై మాలికా సమర్పణము గావింప నెంచుట తిల కించి శివుఁడే జాలినొంది మెడను ముందుకుఁజాపఁగా బుష్ప మాల మెడను వైచెను. ఈ కథను దెల్పు నొక పురాతన

దేవాలయ మిప్పటికిని తిరువడ ముదూరు నందున్నది. తాటకి అనగా—తట్=ఆపుట, అనఁగా శైవధర్మ విరుద్ధమైన జీవ హింస నాపుట=జీవహింస నాపునది కానఁ దాటకియయ్యెను. రామాయణము కూడ నీమెను యక్షిణి యనియు, యజ్ఞ విఘ్నకారిణి యనియుఁ జెప్పు చున్నది. ద్రావిడ భక్తుఁ డొకఁడు భగవద్ధ్యానముఁ జేయుచు "ఓ దయామయా! తాట కికి నలవడిన భక్తి నా కెన్నఁడిత్తువు. అందనుక నాకు ముక్తి కలుగదని వేడెనఁట. శూర్పణఖ జీవసమాధిని బొందెనని ద్రావిడ చరిత్ర చెప్పుచున్నది.

రావణుఁడు దక్షిణదేశముననుండి సింహళముపై దండెత్తి కుబేరుని మళయాళమునకుఁ దఱిమి, లంక నాక్ర మించుకొని రాజధానిం జేసికొనియె. ఇతఁడు మహా బలపరా క్రమ సంపన్నుఁడు, అధిక సౌందర్యవంతుఁడు, మిగుల ధీశాలి, అసమాన శైవభక్తి ప్రపూర్ణుఁడు, ధర్మప్రభువు. పాఠకుఁడా! యీ విశేషములు నీ కాశ్చర్యమును బుట్టింప వచ్చును. మా వాక్యము లాకర్ణించిన నయ్యది పోఁగలదు. బలపరాక్రమ సంపన్నుఁడనుట రామాయణముఁజదివిన వారికెల్లఁ దెలిసియే యుండును. సౌందర్యవంతుఁడనుటకు సుందరకాండములోఁ ప్రథమ సందర్శనమున రావణుం గూర్చి హనుమంతుఁడు తల పోసిన తల పోతలె తార్కాణము.

వేదము లగమ్యారణ్యముగా నున్నయప్పుడు ఛేదించి యుదాసీంతనులు వల్లెవేయుటకుఁ దారిఁజూపె. ఇదియే నేఁటి కిని రావణ భట్టీయమను పేరనున్నది. ధీశాలియే కాక బ్రహ్మజ్ఞాని. ఇందుచేతనే రావణవధానంతరము రాముని బ్రహ్మహత్యా మహాపాతకము పీడించినది. ఇదియుఁ గాక

యితఁడు నవకోటి శివాలయార్చకుఁడు. మలయాలమునం దున్న గుడి గోపురము లితఁడు ధర్మప్రభువని వేనోళ్ళఁబలుకు చున్నవి. ఇవన్నియు వీని సుగుణములు. దుర్గుణము లున్నవి లేనివి కల్పించి విసుగు, విరామములేకుండఁ గంటికి నిద్ర యెఱుంగకుండఁ బ్రతిపక్షరచితమయిన రామాయణము లోకమునకు వెల్లడించుచునే యున్నది.

## రామాయణయుద్ధ మెప్పుడు జరిగినది?

మన పౌరాణికకవులు మున్నగువారు, సార్వభౌములకు, ఋషిసత్తములకు నాయువు నిచ్చుటయందు దానకర్ణులైరి. ఇంత యుదారస్వభావము మఱియే యితర దేశకవులయందుఁ గనబట్టదు. సూర్యవంశ్యులగురాజులకు వేలకొలంది సంవత్సరములు దానముఁ జేసిరి. వసిష్ఠాదులగు ఋషులకు బ్రహ్మాయువే యొసంగిరి. ఇంతటితోఁ దనివి సనక విభీషణ హనుమత్ప్రభృతులకు రామనామ మీలోకమునఁ బ్రవర్తించిన యంతకాలము జీవింపుఁడని వరంబిచ్చిరి. వరంబిచ్చుట యొక యెత్తు. అది చెల్లుట మఱియొక యెత్తుకదా! ఇప్పటికిని విభీషణుఁడు పర్వదినంబుల రామలింగేశ్వర స్వామిని బూజించి పోవుచునే యుండునఁట. కాని మన యదృష్టహీనతచేఁ గన్నులుండియుఁ గాంచ లేకున్నాము.

ప్రాచీనులు కాలమును నాలుగు యుగములుగా విభజించిరి. అందు మొదటి యుగమయిన కృతయుగమునకు 1728000 సంవత్సరములును, రెండవ యుగమయిన త్రేతకు 1296000 వర్షములును, మూడవ యుగమయినద్వాపరమునకు 864000 హాయనములును, నాల్గవ యుగమగు కలియుగము

నకు 432000 యేండ్లును నొసంగిరి. శ్రీరామచంద్రుఁ డిందు రెండవ యుగమయిన త్రేతాయుగ మహాపురుషుఁడు. త్రేతాయుగము కడపట శ్రీరామచంద్రుఁడు రాజ్య మేలెనని తలంచినను, నిప్పటికి రమారమి 869000 యేండ్ల క్రిందట నున్నాఁడని స్పష్టపడగలదు. అనేక కారణములచే నియ్యది యసంభవముగాఁగన్పట్టుచున్నది. పాఠకుఁడా! యార్షే యములగు గ్రంథములను ధిక్కరించి ప్రజ్ఞావిశేషమును జూపించుటకు యత్నించు చున్నారమని భ్రమ పడకుఁడు. ఋషి భక్తి యందు మే మెవ్వరికిని దీసి పోము. కాని బహుళ గ్రంథావలోకనమునఁ గ్రోడీకరించిన కొన్ని సంగతు లను నీకు నివేదింతుము. గ్రాహ్యంబులయిన గ్రహింపుము. అగ్రాహ్యంబులని తోఁచినఁ ద్రోసిపుచ్చుము. ఇంతియే మేము గోరునది.

భారత యుద్ధము ద్వాపరాంతమునఁ బ్రవర్తిల్లెనని హిందువులెల్ల రెఱుంగుదురని నమ్మెదము. భారతపురుషులు రామాయణ వీరులను జూచుట తటస్థించునెడల నీ రెండు యుద్ధముల మధ్యనున్న కాలము లక్షలకొలంది సంవత్సర ములుగాక యత్యల్పమై యుండవలయునని ప్రాజ్ఞులగు విమర్శ కులకుఁ దోఁపకపోదు. కావున భారత రామాయణ పురు షులకుఁగల్గిన సందర్శనంబులఁ గొన్నింటి నిటఁజూపించు చున్నాము. కౌంతేయ మధ్యముండును నపారభుజబల సంప న్నుఁడునయిన భీముని కరణ్యావాసంబున నాంజనేయ సందర్శ నంబు లభించె. భాగవతంబున ద్వివిదుఁడను వానరుని బల రాముడు సంహరించెను. అమృత భక్షకులును, సుగ్రీవుని

మామలునై రామ రావణ యుద్ధమున నద్వితీయ పౌరుషంబుం జూపిన మైంద ద్వివిదులలో ద్వివిదుఁడితడే. భాగవతంబునఁ గృష్ణభగవానుండు వానరులయందెల్ల మిగుల వృద్ధుఁడగు జాంబవంతుని నోడించి తత్సుతను బెండ్లాడుట మనమెఱుంగుదుము. సీతామహాదేవి జనకుఁడయిన విదేహుని యొద్ద బలరాముఁడు తత్త్వవిద్య నభ్యసించెను. శ్రీరామచంద్రుని సమకాలికుఁడయిన పరశురామునకును, భారత ప్రపితామహుఁడయున భీష్మునకును నెక్కటి కయ్యము సంభవించెను. రాజసూయాధ్వర సమయంబున నకులునకు విభీషణుఁడు కానుకలిచ్చెను. రామాయణ కృతికర్తయగు వాల్మీకి ప్రియశిష్యుండైన భరద్వాజుని కుమారుఁడయిన ద్రోణుఁడు కురుపాండవులకు ధనురాచార్యుఁడయ్యెను. రామాయణ భారత పురుషుల పరస్పర సందర్శనముచే నీ యుద్ధద్వయమునకు మధ్యనున్న కాల మత్యల్పమని యూహింపనగును. గాని రామాయణ యుద్ధకాల నిర్ణయముచేయుటకు మాత్ర మయితికాదు. కాని భారత యుద్ధము మూఁడు నాల్గువేల సంవత్సరములకు బూర్వము జరిగియుండునని కొందఱు చారిత్రకు లభిప్రాయపడుచున్నారు. ఇంతియకాని రామాయణమునయున్న యే యితర యాధారములు కాల నిర్ణయమున కనుకూలపడవు. ప్రతిపక్ష దేశమయిన సింహళమున నేమయిన నాధారములు దొరకునేమో చూడవలయును. సింహళ ద్వీప వాస్తవ్యులు హిందువులకన్న నెక్కువ జాగరూకతతోఁ దమ దేశచరిత్రను వ్రాసియుంచిరి.

సింహళద్వీప చరిత్రయగు "రాజావళి" యను మిగుల పురాతన గ్రంథ మీ విధముగా వాకొనుచున్నది. "బుద్ధ

దేవుఁడు తన సత్య సందేశమును లోకమునకుఁ దెలియఁజేయుటకుఁ బూర్వము 1844 సంవత్సరముల క్రిందట శ్రీరామచంద్రుఁడు సింహళముపై దండెత్తెను."

బుద్ధదేవుఁడు క్రీస్తు పుట్టుటకుఁ బూర్వము 526 సంవత్సరముల క్రిందట తన సందేశమును లోకమునకు బోధించెను. అనఁగాఁ గ్రీస్తు పుట్టుటకుఁ బూర్వము 2370 వర్షముల క్రిందట శ్రీరామచంద్రుఁడు సింహళముపై దండెత్తెను. అనఁగా నేఁటికి (2370+1922) 4292 సంవత్సరముల నాఁడు లంకాపట్టణ జైత్రయాత్ర సంభవించెను. ఇయ్యది రామాయణ భారత యుద్ధముల మధ్యకాలము నత్యల్పము చేయుటచే విశ్వాసనీయముగా నున్నది. ఇంతకన్నను బలవత్తరమయిన కారణములు గోచరించు వఱకు నీ కాలనిర్ణయమే సమంజసమని తోఁచుచున్నది. నాల్గువేల సంవత్సరములన్న సామాన్యముకాదు.

పాఠకుఁడా యింతదనుకే యతి దీర్ఘమయిన పీఠికను దెలుఁగు దేశమునకు సంబంధించిన యొకటి రెండు సంగతులు ముచ్చటించి ముగించెదను. శ్రీరామచంద్రుఁడు తెలుఁగు దేశమునకు వచ్చెననియు, భద్రాద్రికడ నున్న పర్ణశాల రాముని పర్ణశాలయనియు, నుష్ణగుండము సీతామహాదేవి స్నాన మాచరించిన గుండమనియు, నాంధ్రులకు మిగుల నమ్మకమున్నది. ఇది కేవలము చరిత్ర విరుద్ధము. కైకచే నర్థింపఁబడినవాఁడై శ్రీరామచంద్రుఁడు గంగానది నుత్తరించి దక్షిణాభిముఖుఁడై, బొంబాయి రాజధానిఁజొచ్చి, నాసిక యందు శూర్పణఖా నాశికావిచ్ఛేదనం బాచరించి, పదంపడి రావణాపహృతభార్యుఁడై, బళ్ళారియందు సుగ్రీవుని చెల్మిఁ జేసి యచ్చటనుండి దక్షిణంబుగా, బయలుదేరి లంకం బ్రవే

శించి, రావణసంహారంబుఁ గావించెను. ఇంతియకాని భద్రా
ద్రికి రానులేదు, వచ్చుటకు నావశ్యకతయును లేదు. పర్ణ
శాలయు నుష్ణగుండమును రామునకు నేమాత్రము సంబం
ధించినవి కావు. ఉష్ణగుండము సీతామహాదేవి స్నానమాచ
రించుటకు సృష్టింపఁబడినదికాదు. ఇట్టివి పెక్కు దేశముల
యందుఁ గలవు. ఐసులాండు (Ice-Land) అను ద్వీపము
నందు నాకాశములోనికి నెగయుచుండు తప్తోదకముగల యుష్ణ
గుండములు పెక్కులు కలవు. ఇంతయేల? మన హిందూ
దేశమునందే బరోడా రాష్ట్రము నందున్న "యూగే" అను
గ్రామమునందు నుష్ణగుండములుకలవు. ఇవన్నియుఁ బ్రాకృత
జనంబును లోఁబఱచుకొనుటకుఁ బన్నిన తంత్రములు. పాఠ
కుఁడా! యభిప్రాయ భేదములను బాటింతురని చెప్పి నిర్భ
యముగా మా యభిప్రాయములన్ని మీకు నివేదించితిమి.
పొరపాటులున్న యెడల నెఱుఁగఁజేసిన యుక్తమయినచో
దిద్దుకొనుటకేమియు నభ్యంతరము లేదు. ఒక్కరయినను నీ
గ్రంథమును సాంతముగాఁ బరిశీలనబుద్ధితోఁ జదివిన యెడల
మా శ్రమ వ్యర్థముకాలేదని తలంతుము.

---

# నాటక విషయము

శంబుకవధ మతరక్షణాసక్తి ప్రేరితము కాదనియు, రాజనీతి ప్రేరితమనియు, నుత్తర రామాయణముఁ జదివిన వారికెల్ల బోధపడక మానదు. ఈ విషయమున మా యభిప్రాయములను నీ నాటకమే చాటుచుండుటఁజేసి యిచ్చట వెండియుఁ జెప్పుట యనవసరము. ఈ నాటకమునఁ గథానాయిక లేదు. అనవసరమును, సంబంధమును లేని కథానాయికను గొనితెచ్చి వృథా నాటకమును బెంచుటకన్న వదలివేయుట యుత్తమమని తలపోసి యిట్లాచరించితిమి. ఇయ్యది నూతన మార్గము కాదు. సంస్కృత నాటకమగు "ముద్రారాక్షసమునకును గథానాయిక లేదు. నాటకవిషయమునఁ "గురుక్షేత్రసంగ్రామము" యొక్క పీఠికలో బయలుపుచ్చిన యభిప్రాయములే యింకను మమ్ము బాధించుచున్నవి. పద్యముల యందలి గణయతిప్రాసము లెట్టి మహాకవికైనను గొంతవఱకుఁ బ్రతిబంధకములని యెల్ల రెఱింగినదియే. కాన సముచిత పద ప్రయోగమున భావప్రకటనముఁ గావించుటకుఁ గొన్ని యెడల నసువు కల్గదు. కాఁబట్టి వచనమునందుకన్నఁ బద్యమునందు నెక్కువ భావప్రకటనమునకవకాశము గలదన్న వాద మాదరణీయము కాదు. కాని పద్యనాటకములయందు సంగీతము ముఖ్యాంగమగుటంజేసి యయ్యది ప్రేక్షకుల మనోగతులను గొంతవఱకు లోఁబఱచుకొని రసోదయముఁ గావించును. అయినను గద్యనాటకములయందు నభినయ విశేషము చేతను, స్వరగతి చేతను నీ రసోదయమునే కల్పింప వచ్చును. పద్యమునకన్న గద్యము

ప్రాకృతజనంబునకు సులభగ్రాహ్యముగా నుండును. కాన సంగీత నాటకములున్నను, లేకున్నను, వచన నాటకములు మాత్ర మత్యవసరము. "షేక్సుపియరు" పద్యనాటక ప్రదర్శనములఁ జూచి, తలయూచి, యానందించి, వచన నాటకముల యందిట్టి భావ ప్రకటనము సాధ్యమగునాయని తలంచుట వెఱ్ఱి. నేఁడు "బెర్నార్డుషా" వచన నాటకములంజూచి మెచ్చని వారెవ్వరు ? ఈ మహాకవి నాటక ప్రదర్శనముం గాంచు భాగ్యము మాకుఁ గల్గినది. ఒక్కొక్క సందర్భమున మేము తన్మయత్వముఁ జెంది, కంటియెదుట జరుగుచున్నది ప్రదర్శనమను మాట మఱచితిమి. ఈ మహాకవి రసోచిత పద ప్రయోగ మటులుంచి యిట్టి తన్మయత్వ దశ కల్గించిన దెద్దియో యనునది విచారించవలయును. దీనికిఁ గారణములు పెక్కులు గలవు. అయినను ముఖ్య కారణములఁ గొన్నింటి నిచ్చుచుంటిమి. ఇందు మొదటిది యభినయము. అభినయ మనఁగాఁ జేతులు, కాళ్ళు, కన్నులు కదల్చుటయే కాక, పలుకులచే వ్యక్తీకరింపఁబడు నవస్థకు ననుకూలమగు ముఖలక్షణ కల్పన కూడ నగును. ముఖ లక్షణముతో పాటు కంఠస్వరము కూడ మార్పుఁ జెందవలయును. ఇవన్నియు మరలఁ బాత్రోచితముగ మాఱుచుండవలయును. అప్పుడే పాత్ర ప్రేక్షకుల మన మాకర్షించి, రసోత్పత్తి కల్గించును; మహారాణికిని, సామాన్య స్త్రీకిని, నొక్క విధమగు నాపద సంభవించినను, నిరువురు నొకవిధముగా శోకింపరు. మహారాణి గుమిలి, కుమిలి పనవును. సామాన్యయో గొంతెత్తి, బావురుమని యేడ్చును. ఈ భేదము సహజముకాదని కొందఱభిప్రాయ పడు చున్నారు. వారితో మే మేకీభవింపక పోవుటయే కాక

యింకఁ బ్రాపంచక జ్ఞానము గడియించుకొనిన, వారట్టి యభి ప్రాయమును సవరించు కొందురని నమ్ముచున్నాము.

పాఠకుఁడా !

దీర్ఘమగు పీఠికను వ్రాసి విసుగుఁ గొల్పియుందుము. మేము వెలివఱచిన యభిప్రాయములయందు నేమేని పొర పాటులున్న వానిని దెలియఁజేసిన యెడల వందన పూర్వక ముగా నందుకొనుటయే గాక తృతీయ ముద్రణ భాగ్యము లభించినయెడల సవరించుకొనియెదము. కాని మాత్సర్య గ్రస్తులై వెఱ్ఱి విమర్శనలకు దిగువారి నుడులను బెడచెవులఁ బెట్టెదము.



## —: పాత్రలు :—

శంబుకుఁడు

శ్రీరాముఁడు

వశిష్ఠుఁడు

అంగదుఁడు

హనుమంతుఁడు

సోమయాజి

జైనులు

గురుదాసు

బ్రాహ్మణుఁడు

బ్రహ్మదాసు

ద్వారికుఁడు

# శంబుక వధ
## (ఉత్తర రామచరిత)

ప్రథమాంకము.

(పథశ్రమమున నంగదుఁడు ప్రవేశించును.)

అంగ :- అబ్బబ్బా ! ఎక్కడ కిష్కింధాపురము ? ఎక్కడ సాకేతపురము ? తుంగభద్రానదినుండి సరయూనదికి రావలయును. వెఱ్ఱికి వేయి విధములన్నట్లు నేనీకాలి నడకను రాఁబూనుటేల ? గాంధర్వ విద్యచే నాకాశ గమనంబునరాకతక్కుటేల ! ఈ యార్యుల జన పదమ్ములఁజూచి యానందింపవలసినది యేమున్నది ? వీరి యాచార వ్యవహారములను జూచి నేర్చుకొనవలసినది యే మున్నది ? పర్వత సానువులఁ, బచ్చిక పట్టులఁ, జెట్లతోఁపుల నడిమి నున్న మాపల్లెలే కన్నుల పండువుగ ముద్దులు మూటఁ గట్టుచుండును. ఈ యార్యుల పేరుగొప్పయేగాని పరీక్షించిన కొలంది యేదియో సామెత జ్ఞాపకమునకు వచ్చుచున్నది ! (విచారించి) అవురా ! యెంత మంచివాడైన నేమి ? జాత్యాభిమానము వీడదు కదా ! కొలఁది దినములనుండి మాయం "దపనమ్రకము" గూడఁ గల్గినట్లున్నది. కారణమో !

మేము తమ జాతివారము కామనియా ? మేలు ! ఏవియో మాయ మాటలు చెప్పి, కిష్కింధానగర వానర సామ్రాజ్యమునకు గుండెయు, మా నమ్మిన బంటును, నగు హనుమన్నను సాకేతపురమునఁ గట్టి వైచెను. ఇప్పుడో ! యేదోమిష పెట్టి నన్ను రప్పించు చున్నవాఁడు. దీనినంతయుఁ బరిశీలింప వానర సామ్రాజ్యము తన కైవసమున నుంచుకొనుటకు మమ్ములఁ బూటకాపు చేసినట్లు తోఁచుచున్నది. మా పూర్వ సాహాయ్యమైనఁ దలంపక మతమని పేరు చెప్పి క్రమక్రమముగ దినదినము మా స్వాతంత్ర్య మును గుంజు కొనుచున్నాఁడు. ఎవ్వరును లేరుగదా !

(యిటునటు చూచి)

గీ. అన్నతోఁ దలపడి పోరి యాతురమునఁ
బెఱనుగొని తెచ్చి నెత్తిపైఁ బెట్టుకొనియు
నకట ! తప్పించుకొను నుపా యంబులేక
విసుగుపడుచున్నవాఁడు మా పిన్న తండ్రి. ౧

సీ. నలుఁడు లేకుండిన జలరాశి బంధించి
రావణు లంకకు రాఁగలండె ?
మందుమాఁకులు తెల్పి మాతాత ప్రాణముల్
పోయకున్న నయోధ్య పోవఁగలఁడె ?
కపు లెల్ల దేశముల్ గాలింపకుండిన
దేవి వృత్తాంతంబుఁ దెలియఁగలఁడె ?
దోషాచరులఁబట్టి త్రుంచ[illegible] ండిన మేము
తొడరి తానొక్కఁడే త్రుంపఁగలడె ?

గీ. వీనినన్నింటిఁ దలపండు మానమందు
వానరుల మమ్ముఁ దనతోడి వారిఁగాఁగ
నెంచుచున్నవాఁడంట ! మాకిదియె చాలు
నంట ! యడ్డుచెప్పంగరా దంట ! సుంత.

ఉ. ద్రావిడజాతియంచుమముఁ దానొకయప్పుడులోననమ్మఁగాఁ
బోవక చూడనట్టులదె పో! యొకకంటను జూచుచుండు మే
మేవిహానర్చుచున్న, మఱి యిచ్చునె సౌఖ్యముపారతంత్ర్యమా
హా!విధి!రామరాజ్యమఁట!యక్కట! ఈగతినుండెమాగతుల్.

(విచారించి) యీ నిర్వేదము వలన నేమి యుపయోగము ? అదుగో ! సూర్యభగవానుఁ డపరదిక్కాంతకుఁ గుంకుమ బొట్టయ్యెను. నేఁటికిందు విరమించి ప్రత్యూషంబున సాకేతంబుఁ జేరి రామచంద్ర సందర్శనంబుఁ గావించెద. నన్నొక యార్యునిఁగా బుట్టించనందులకు భగవంతునకు నేను గృతజ్ఞుఁడ. కాయగసరులతోఁ గాలము గడుపఁగల్గుదును. నిండు ప్రాణములతోనున్న యే జంతువునో పట్టి చంపి పొట్టఁ బోషించుకొను నవసరములేదు. ఆహా! యేమి యీ యరణ్యము. పుష్పఫలభరితంబై యున్నది. ఎవ్వరో పండ్లు గోయుచున్నారు ! (దరిఁజేరి) అయ్యా ! యీ సంధ్యాసమయమునఁ బండ్లు గోయుచున్న మీరెవ్వరు ?

శిష్యు :- మేము రామదాసులము.

అంగ :- అనఁగా ?

శిష్యు :- రామునిచే దాసులముగాఁ జేయఁబడినవారము.

అంగ :- ఎవ్వరికి ?

శిష్యు :- ద్విజపోతములకు.

అంగ :- ఎందుచే ?

శిష్యు :- మేము తమజాతివారము కాకపోవుటచే.

అంగ :- అటులయిన మీరెవ్వరు ?

శిష్యు :- వారార్యులంట. మేమనార్యులముంట.

అంగ :- అనార్యులనఁగా ?

శిష్యు :- ఆర్యజైత్రయాత్రకుఁ బూర్వపు దేశవాస్తవ్యులు.

అంగ :- (తనలో) పాక్షికమైన పరిపాలన మెప్పుడు సర్వజన సౌఖ్య సంధాయకము కాదు. వీనిని గొంతవఱకుఁ దఱచి చూచెద. (ప్రకాశముగా) అయ్యా! యేల యింత యసంతృప్తితో మాటాడుచున్నవారు ? భగవదవతారమని యెంచఁబడుచున్న రామరాజ్యములోనె కొఱంత వాటిల్లుచున్నదా ? ప్రాణిసేవ యుత్తమోత్తమమగు కార్యమేకదా ?

శిష్యు :- అయ్యా! యెవ్వరి కెవ్వరి పరిపాలనంబు సర్వ సౌఖ్య సంధాయకముగ నుండునో, వారికి నేతత్పరిపాలకుఁడు భగవదవతారమగును గాని యితరుల కెట్లగును ? కాని ప్రొద్దుగ్రుంకుచున్నది. మా గురువుగారు నాకై యెదురుచూచుచుందురు. నేను పోవలయును. మీ రెవ్వరు ? ఎక్కడకుఁబోవుచున్నారు ? మా యాతిథ్యము గ్రహింప నిచ్చగలదేని నాతో దయచేయుఁడు.

అంగ :- అయ్యా! మీ గురువెవ్వరు ? మీ పేరేమి ?

శిష్యు :- శంబుకసంయమీంద్రుఁడు, నా పేరు గురుదాసు.

అంగ :- శంబుకసంయమీంద్రుఁడా ?

గురు :- ఏమి యట్లు వెఱఁగుపడుచున్నారు ? మా గురువు గారినే యెఱుంగరా ! సాకేతపుర ప్రాంతములకు నెప్పుడయిన వచ్చి యెఱుఁగరా ?

అంగ :- రామపట్టాభిషేక మహోత్సవమునకు వచ్చితిని గాని—

గురు :- అయ్యో ! రామపట్టాభిషేకమున కనుచున్నారు, రామచంద్రుని శిష్యులా ? అటులయినఁ బొరపడితిని. ఇట్టి ప్రసంగముం జేయఁ గిట్టదు.

అంగ :- లేదు, లేదు. మేము మీవలెనే కష్టములననుభ వించుచున్న వారమే. నేను కిష్కింధాపుర యువ రాజను. అంగదుఁడను.

గురు :- అయ్యా ! ధన్యుఁడను. మీరు తప్పక మాయాతిథ్య మును గొనితీరవలయును. మా గురువుగారు మీ యాగమనమునకు మిగుల సంతసపడెదరు. సుగ్రీవ సార్వభౌముని సంగతి యప్పుడప్పుడు మాతో ముచ్చ టించుచుందురు.

అంగ :- నడువుము, వచ్చుచున్న వాఁడను. మీ గురువు గారి సందర్శనమువలన నేనును బవిత్రుఁడనయ్యెద. మహాత్ముని సందర్శనము మాటలతోఁ దొరకదుగదా! (నిష్క్రమింతురు.)

చిదానందాశ్రమము

[శల్యగతప్రాణుండును, జటావల్కలధారియు, శాంత స్వరూపుఁడు నయిన శంబుకర్షి ప్రవేశము.]

శంబు :- అబ్బా ! యింకను రాలేదేమి చెప్పుమా ? జడ

స్వభావుఁడు (పటమటిదిక్కున కన్నెత్తిచూచి) అడుగో!

గీ. అంధకారావృతములైన యట్టి లోక
ములకు నెల్లఁ బ్రకాశంబుఁ బొసఁగుచుండి
జీవరాసుల నెల్ల వీక్షించు కర్మ
సాక్షి యస్తమించుచునుండెఁ జరమదిశను. ౮

స్వపక్ష పరపక్ష భేదములు లేక యీశ్వరాజ్ఞాబద్ధుఁడై, చేతనాచేతనములనెల్ల స్వార్థత్యాగియై, ప్రత్యుపకృతి నభిలషింపక యొక కంటఁజూచు సూర్యభగవానుఁడెంత కృతార్థుఁడు? ఎంత ధన్యుఁడు? ఇందుచేతనే పామరజనంబులు కూడఁ బ్రాతఃకాలమున లేచి, నమస్కరించి యర్ఘ్యపాద్యాదులొసంగి, యాత్మశాంతిని జేసికొందురు.

(తెరలో) ఆత్మశాంతికి నతిథిపూజయే యుత్తమోత్తమమని మీరు నిరంతరము సెలవిచ్చుచుందురుకదా. ఇదిగో! యతిథిని గొనివచ్చితిని.

శంబు :— కుమారా! నీవేనా! యింత యాలస్యమేల చేసితివి? ఎవరా యతిథి? నీవు పోయి పూజాద్రవ్యములను గొనిరమ్ము. ఈశ్వరోద్దేశముచేతను, రాజోద్దేశము చేతను సేవయే కదా మనకుఁ గర్తవ్యము.

[గురుదాసుఁడు, అంగదుఁడును ప్రవేశింతురు.]

గురు :— ఇదుగో! యతిథి. గుర్వాజ్ఞను నెఱవేర్చుటకుఁ బోయెదను. (నిష్క్రమించును.)

అంగ :— కిష్కింధాపురయువరాజు, అంగదుడు నమస్కరించుచున్నాడు.

శంబు :- వత్సా! చిరకాలము మనుము. నిన్నుఁజూచుటచే నా కానందము గల్గుచున్నది. దారితప్పి వచ్చి నట్లున్నది. సుగ్రీవమహారాజు సుఖముగ రాజ్యమేలుచుండెనా! కిష్కింధాపుర పౌరులెల్ల రానందముతో వర్థిల్లుచుండిరా?

అంగ :- మీ యనుగ్రహమువలన నెల్లరు సుఖముగఁ గాలయాపనముఁ జేయుచున్నారు. రామచంద్రదర్శనార్థమై యరుగుచు మార్గమధ్యమున భవచ్ఛిష్యునిఁగాంచి, మీ యాశ్రమము పరిసరంబున నుండుటెఱింగి పతితులను బావనులఁజేయు మిమ్ము సందర్శించు మనంబున వచ్చితి.

శంబు :- కుమారా! యటులయినచో నీ రేయి మా పర్ణకుటీరమునఁ గడపి తెపకడనే పోవచ్చును. సాకేతమిచ్చటకు నతిసమీప్యమున నున్నయది సుమా.

అంగ :- మీ వాక్యములే నా కాదేశము.

శంబు :- ఇదిగో! దర్భాసనంబు. ఇటు గూర్చుండుము.

అంగ :- (కూర్చుండి) దేవా! యకస్మాత్తుగాఁ బట్టాభిరామునకు సంభవించిన యాపత్తు విని సమాశ్వాసింప వానర రాజ్యపట్టభద్రుఁడు నన్నంపుచుండె. పెందలకడనే పోయి భార్యావియోగమునఁ గుందుచున్న దాశరథిని నోదార్పవలయు.

శంబు :- అగును. పాపము. తీరరాని యాపత్తే సంభవించినది. చేతులారఁ జేసుకొన్నదాని కంతగా దాశరథి చింతింపఁడు. చింతిల్లఁడు.

అంగ :- చేతులారఁ జేసుకొన్నది యేమి ?

శంబు :- చేతులారఁ జేసికొన్నది యేమని విస్మయ పడు చున్నావు ?

ఉ. చాకలి వానిమాటలుని జమ్మని నమ్మిచుశంకితాత్ముఁడై
యాకమలాయతాక్షిని,స మంచితసాధ్వినిఁ,బూర్ణ గర్భిణిన్
లోకులు నవ్వఁ గారడవి లో వసియింపఁగ నట్టె పంపఁడే
యాకకునింతయేని నెదురాడని తల్లియటంచుఁగాదొకో. ౫

అంగ :- మహాత్మా ! యట్లుకాదు. సూర్యవంశమునందలి సార్వభౌము లీగకాలియంతయినఁ గలంకము లేకుండఁ బ్రజాపాలనముఁ గావించిరఁట. తద్వంశ జాతుఁడయిన శ్రీరామచంద్రుఁడిట్టి కళంకమునకు నసమానాస్పదుఁడగుటకుఁగూడ నోర్వక యిట్లాచరించెనఁట.

శంబు :- మనము దీని యాథార్థ్యమును శంకింపవలసిన యగత్యము లేదు. కాని, నాఁడు రావణసంహారానంతరమున లంకాపట్టణంబున నిష్కరుణుఁడై యమ్మహాజననిఁ జితి నెక్కించి, హవ్యవాహనుని మూలంబున, నమ్మహాపతివ్రత సాధుశీలమును, నకలంక చారిత్రమును, నవ్యాజ పతిభక్తియుఁ దానెఱుంగుటయే కాక లోకమెల్ల నెఱింగయున్నను, నిప్పుడిట్టి యకార్యమును జేయుటేల ? కేవలము ప్రజలను సంతోష పెట్టుటకేనా ? కుమారా ! యొక్క సంగతియున్నది.

గీ. పెక్కు జనముల సంతోష పెట్టఁదలఁచు
వాఁడొకనినైన సంతోష పఱుపలేక
తుదకు వ్యర్థ ప్రయత్నుఁడై, దుఃఖభాజ
నుఁడగు నిరతంబు పెక్కులు నుడువనేల?

శ్రీరామచంద్రుఁ డీయవస్థనే పొందినాఁడని నా యాశయము.

గురు :- (గురుదాసు ప్రవేశము) ఇవిగో! పూజా ద్రవ్యములు.

శంబు :- ఇటులుంచుము.

గురు :- దేవా! యిప్పుడే వాల్మీకులవారు రామాయణము వ్రాసిరఁట. శ్రీరామచంద్రుని భగవదవతారముగాఁ గూడఁ జేసినారఁట.

అంగ :- గురుదాసా! కాఁడనియా నీ నమ్మకము?

గురు :- కాకేమిగాని, కవీంద్రుని లేఖినిలోనున్న మాహాత్మ్యము మాత్రము నన్నబ్బురపడఁ జేయుచున్నది. కవి లేఖినికి విశ్వామిత్రసృష్టిఁ జేయు శక్తి గలదు.

అంగ :- గురుదాసా! యేమి నీయుపాలంభనములు?

గురు :- యువరాజా! నన్నుఁ బరిహాసింపకుము. మన హనుమంతుఁడు కూడ నొక రామాయణము వ్రాసి శ్రీరామచంద్రున కర్పించెనఁట. ఎందుచేతనోకాని దానిని సముద్రమునఁ బాఱవేయించెనఁట.

శంబు :- కారణమేమి?

గురు :- శ్రీరామచంద్రుని భగవదవతారముగా వర్ణింపక యసాధారణ మనుష్యమాత్రునిగా వర్ణించుటచేనని లోకము చెప్పుకొనుచున్నది. లోకము నోరుమూయిం చుట కెవ్వారికి సాధ్యము ?

అంగ :- మంచిపనియే జరిగినది.

శంబు :- సరే ! నీవుపోయి మన పర్ణకుటీరము తూర్పువైపు గదిలో దర్భలతో మెత్తని సెజ్జ యొనర్చి, వానర రాజునకుఁగాను వివిధఫలముల నందుంపుము.

గురు :- చిత్తము. (వెడలును)

అంగ :- (తలపంకించుచుఁ దనలో) పారతంత్ర్యమందున్న వారిగతి యింతియేకదా ! (ప్రకాశముగ) దేవా ! మిమ్ముల నొక ప్రశ్నమడుగవలయునను సముత్కంఠ యున్నది. మిమ్ములఁజూచి చూచుటతోడనే సర్వ శాస్త్ర పారంగతులనియు, నిష్ఠురతపో నిష్ఠాగరిష్ఠు లనియు, బ్రహ్మజ్ఞానధనులనియు, మా బోంట్లకుఁ దోఁచకమానదు. కాన... ... ...

శంబు :- ఇది కేవలము స్తుతిమాత్రము.

అంగ :- మహనీయులు స్వోత్కర్ష వర్ణన విననొల్లరు. మీ కెట్లు దోఁచినను మాకు మాత్రము సత్యము; కావున నా యల్పబుద్ధికిఁగల్గిన శంకను గూర్చి మిమ్ముఁ బ్ర శ్నింప మనంబు వేగిరపడుచున్నది.

శంబు :- కుమారా ! యాయఖండజ్ఞానస్వరూపుని ముంగల మన మందఱ మణుమాత్ర పరిజ్ఞానులము. మన యందలి తారతమ్యము కూడ నంతియే.

అంగ :- మీ సౌజన్యము మిమ్మువలనట్లు పలికించుచున్నది.

ఏది యెట్లున్నను నా సందియమును దీర్చుటకు మాత్రము మీ రర్హులు.

శంబు :- నీకా యభిప్రాయమున్న నడుగుము.

అంగ :-

చం॥ జపము, తపంబు, రెండునుద్విజనున్నలవైదికకర్మముల్ గదా నృపతికి వర్ణధర్మముల నెల్లను బ్రోచుట ధర్మమంచు నెల్లపుడు వచించుచుండునుగ దా! మనశాస్త్రములట్లుగాన, మిమ్మిపుడయు పేక్ష సేయఁగలఁడే? రఘురాముఁడుకంటఁజూచినన్.

శంబు :- కుమారా! యంగదా! నీ సంశయములను దీర్తునుగాని మన శాస్త్రములనుచుంటివి. ఎవ్వరి శాస్త్రములని నీ యాశయము?

అంగ :- ఆర్యులు చెప్పిన స్మృతులని నాయాశయము.

శంబు :- అవి మన వెట్లగును?

అంగ :- ఇందు భిన్నాభిప్రాయుఁడను. మన వెట్లు కావో తెలియకుంటిని?

శంబు :- ఇదుగో! వినుము. తెలియఁగలదు.

చం. ఋషులో! మఱెవ్వరోపలువు రెచ్చటనోగుమిగూడితాముకల్మషమతిఁ బక్షపాతముగ లక్షలగ్రంథము వ్రాయఁగా నకిల్బిషములటంచు నెత్తిపయిఁ బెట్టుక పూజయొనర్ప నేర్తుమే? ఋషులకుమాత్రముండవల దేఋజుమార్గమువాలినందనా?

ఇట్లు వ్రాయఁబడిన శాస్త్రములు మన శాస్త్రములెట్లగును? మనకుఁగా వ్రాసిరా? మన యభిప్రాయములఁగొనిరా? కానినాఁడు మనమేల వానిచే బంధింపఁబడవలయు?

అంగ :- ఋషులు కల్మషమతిఁ బక్షపాతముగ గ్రంథము లను చెప్పిరని చెప్పుట సాహసమని యభిప్రాయ పడు చున్నాను.

శంబు :- కుమారా! సాహసమెట్లగును? పక్షపాతముగ వ్రాసిరో లేదో యోజింపుము.

సీ. చోరత్వమును జేయ శూద్రుని కవయవ
విచ్ఛేదనము శాస్త్ర విహితమంట!
ఆ దోషమునె విప్రుఁ డాచరించినయంత
మండలింపులె ధర్మ మార్గమంట!
బ్రాహ్మణీస్నేహసం పర్కమ్ముగల శూద్రు
నగ్నికర్పించుట న్యాయమంట!
శూద్రవనిత మరుల్ సోకిన విప్రుండు
సంతాపపడుటయే చాలునంట!

గీ॥ ఇవియె మన ధర్మ శాస్త్రము లిందునందు
నివియె చుమ్మి నిష్పక్షపాతైక బుద్ధి
మనకుగాఁ జెప్పి పెట్టిన మహితములగు
గ్రంథరాజముల్ వానర రాజ పుత్ర!

అంగ :- సంయమీంద్రా! యేదియెట్లున్నను మనమెన్నఁడో వారి మతమును స్వీకరించితిమి, అట్టిచో—

శంబు :- అచ్చటాగుము, అట్లనఁజనదు. మనము వారి మతమును స్వీకరింపలేదు. పరస్పర మతసమ్మేళనము వలన నిష్పన్నమైన దీహిందూ మతము. వారిది

జ్ఞానయోగము, మనది భక్తి యోగము. ఈ యోగములు రెండును హిందూ మతమునకు మూలాధారములే.

అంగ :- అయినచో మన మత గ్రంథముల మనమే తూలనాడుట సమంజసమగునా? యిది విచారింపవలదా?

శంబు :- కుమారా! యెంత వెఱ్ఱిపడితివి. ఇవి మతగ్రంథములా! ఇప్పుడే యీ స్మృతి కర్తల కడకేగి భగవద్ధ్యానముఁ జేయుటకును, భగవత్కైంకర్యముఁ జేయుటకును, భగవత్సాన్నిధ్యముఁ జేరుటకును, నీకులము లేమయిన నడ్డుపడునందురేమో ప్రశ్నింపుము.

అంగ :- ఏమందురని మీ యుద్దేశ్యము?

శంబు :- ఇందుద్దేశ్యమేల? నిశ్చయమే. ఏకగ్రీవముగా నీశ్వరుని దృష్టియందుఁ నెల్లరును దుల్యులని వారు నిశ్శంకముగాఁ జెప్పెదరు.

అంగ :- అటులయినచో నీ స్మృతులన్నియు నిట్టులేల చెప్పిరి? కారణమేమి చెప్పెదరు? దీన ఋషులకు లాభమేమి?

శంబు :- ఇదియే మనము శ్రద్ధగా విచారింప వలసినది. చెప్పెద వినుము. ఇవి సంఘ నిర్మాణమునకు దీర్ఘదృష్టితోడను, నైపుణ్యము తోడను నేర్పఱచిన కట్టుదిట్టములు. ఈ శిక్షాస్మృతులు లేకున్న సంఘము చీకాకుపడి నిర్వీర్యమును దుర్బలమును నగునని నమ్మి వీనిఁ బుట్టించిరి.

అంగ :- స్మృతులు మతసంబంధములగు గ్రంథములే కావా?

శంబు :- ముమ్మాటికిని గావు. సాంఘిక చరిత్రమునకు సంబంధించినవి. ఇట్లు వివరింపకయే రెంటిని గలగలిపి

మనలను మతస్వాతంత్ర్య దూరగులఁ జేసి మహాపాతకమును మూటఁగట్టుకొనుచున్నారు. భగవంతుఁ డిట్టి వాఁడని యివి బోధించుచున్నవా?

అంగ :- అటులయినచో స్మృతు లనవసర గ్రంథములనియా మీ యభిప్రాయము?

శంబు :- కుమారా! అట్లుకాదు వినుము. పరాజితులఁ దమ సంఘమునందుఁ జేర్చుకొనునప్పుడు జేతలు జాగరూకులై యుండుట ధర్మము. లేక సమాన స్వాతంత్ర్యమును, స్వత్వమును నొసంగినఁ బాలితులకుఁ బాలకుల లోపాలోపములును, బలాబలములును దెలియును. దానఁ బాలకుల యుచ్చదశకుఁ దప్పక భంగము వాటిల్లును. కావునఁ బాలితులకుఁ బాలకుల యాయువుపట్టుఁ జూపించుట రాజనీతి కాదు. ఇది తలంచియే కొందఱు ఋషులు స్మృతులు రచించి సంఘమును బలవత్తరముఁ చేసికొనిరి. ఇదియే ఋషులకుఁ గల్గు లాభము.

అంగ :- ఈ సిద్ధాంతముచే మీవాదము నీరసమగుటలేదా? మనము పాలితులముకాన సమానములగు హక్కుల నీక రాజ్యతంత్రావరణమునకు దూరముగ నుంచుట రాజనీతియేకదా?

శంబు :- అగునుగాని యింకొక్క సంగతి యున్నది. ఇది రాజనీతియే. కాని. మనమేనాఁడో యేకమతస్థులమై వారి యాచారవ్యవహారముల నవలంబించి సంపూర్ణముగా నార్యసంఘముతో నేకీభావమును బొందితిమి. ఇట్టి మనలను బరులఁగాఁజూచుట రాజనీతికి విరుద్ధము

కాన మనమార్యసంఘముతో బాటు సమాన స్వాతం
త్ర్యమును, హక్కులను బొందఁదగియున్నాము. వానిని
బొందుటకే మేమిప్పుడు సర్వప్రయత్నములు సేయు
టకుఁ గృతనిశ్చయులమయి యుంటిమి. ఈ యాశ్రమ
స్వీకారముఁగావించి, హింసాపరాఙ్ముఖుఁడనై భగవ
ద్ధ్యానముఁ జేసికొనుటకు నన్నీద్రావిడచర్మ మాటంక
పఱచునా ? ఆత్మకు నీ యావరణతో సంబంధ మే
మున్నది ? భగవంతుఁడు దీని నేల నిషేధించును ?
నిషేధించిన భగవంతుఁడెట్లగును ? భగవంతునకు
సమబుద్ధి యుండదా ?

అంగ :- మహాత్మా ! సంపూర్ణ విజ్ఞానముఁబొందితిని. నా
యవివేకపుఁ బ్రశ్నల మన్నింపుఁడు. (సాష్టాంగ నమ
స్కారముఁజేయును.)

శంబు :- వత్సా ! లెమ్ము, లెమ్ము, ఇది యనుచితము.
(లేవఁదీయును.)

అంగ :- మీ యీ బోధనలను ద్విజులు విన్న తూష్ణీంభావ
ముతో నుపేక్ష సేయుదురా ?

శంబు :- ఏందుల కుపేక్షచేయుదురు ? వారి యాధిక్యమునకు
భంగములగు కార్యముల వారుపేక్షింతురా? ఇది సహ
జమే కదా ? మఱియు నీ యభిప్రాయములన్నియు,
వికసింపక మొగ్గగా నున్నయపుడే గిల్లివేయ విశ్వ
ప్రయత్నములు సేసెదరు. ఇంతకుమున్నే ద్విజ సంఘ
మునందుఁ గలవరపాటుద్భవిల్లినది.

అంగ :- దేవా ! నాకొక భయము పొడముచున్నది. ఇది
కలవరపాటుతో నాఁగునని నమ్మను.

శంబు :- ఎంతవఱకుఁ బోవునందువు ?

అంగ :- రాజు బ్రాహ్మణాధీనుఁడు. అందు శ్రీరామచంద్రుఁడు వర్ణాశ్రమాచారముల నెలకొల్ప బద్ధకంకణుఁడు. కాన మీ స్థూలశరీరమునకే యుపద్రవము గల్గునని భీతిల్లు చుంటిని.

శంబు :- కుమారా! యిట్టిది నేనెఱుంగకపోలేదు. అయినను శ్రీరామచంద్రుఁడు యుక్తాయుక్త విచారణ సేయక యీ యకార్యమునకు నొడిగట్టునను విశ్వాసములేదు. దుష్టశిక్షణంబునకు, శిష్టరక్షణంబునకును నుపయోగింపఁబడు చున్నదన్న యీ నిశాత కరవాలంబు నిరపరాధియు, దుర్బలుఁడునునైన యొక ముని కంఠముపై కెగయునా ?

అంగ :- స్వామీ! శ్రీరామచంద్రుఁడొకఁడేమయిన నిట్టి యవినీతి కార్యములకుఁ దెగఁడు కాని ద్విజులు బలవంత పెట్టి చేయించకుందురా ? ఇయ్యది దుష్టశిక్షణ, శిష్టరక్షణంబని, శ్రీరామచంద్రునకు బోధింపరా ? శ్రీరామచంద్రుని నిమిత్తమాత్రునిఁ జేసెదరు.

శంబు :- శ్రీరామచంద్రుఁడు బ్రాహ్మణులచేతిలోని కీలుబొమ్మ యనియా నీ యభిప్రాయము. అట్లయిన నేను చింతింపవలసిన కార్యమేలేదు. ఈ శరీరంబునకు మరణంబు నైసర్గిక ధర్మంబు. ఇదివఱకే నిరంతర తపంబుచే, శుష్కించి, శుష్కించి, శల్యావశిష్టంబుగ నున్నది. ఈయెముకల ప్రోవుపై శ్రీరాముఁడు విశ్వామిత్ర దత్తమైన ధనుష్పాండిత్యము మెఱయ నస్త్ర ప్రయోగముఁ గావించి కీర్తినిబొందినఁ బొందునుగాక!

శిష్యుని లక్ష్యజ్ఞానమునకు విశ్వామిత్రుఁడు సంతసించిన, సంతసించుగాక. కుమారా! యింకొక్కటి విచారింపుము.

సీ॥ ఇల్వలవాతాపు లిద్దరు పల్వుర
మనుజుల దిగమ్రింగి రనుటయేల?
కుంభకర్ణాదులు గుటగుట రక్తంబుఁ
దెగఁద్రావిరని చెప్పి తెగడుటేల!
చేతికందినయట్టి జీవరాసులఁ గబం
ధుఁడు చంపి, తినెనంచు నుడువుటేల?
మత్తిల్లి తారక మనుజాళి పల్వుర
భక్షించెనని చెప్పి బదరుటేల?

గీ. సూర్యవంశోద్భవుం డతి శూరవరుఁడు
వివరమెఱిఁగిన మనుజుండు బికిరమెత్తి
కొనుచు జీవించు నొక కృశాంగుని నలోకి
కుని నిరపరాధు దయమాలి గొంతుఁగోయ. ౧౦

అంగ :- అమంగళము ప్రతిహతమగుఁగాక.

శంబు :- ఇందమంగళమేమున్నది? జరుగవలసిన కార్య విధానమేయిది.

అంగ :- అయ్యా! యీ వృథామరణము వలన లాభమేమున్నది?

శంబు :- ఏమున్నదా? శ్రీరాముఁడు ఖడ్గహస్తుఁడై చనుదెంచి, సన్నిజపతపంబులు మాని ద్విజసేవ చేయు

మన్నను నా యంతరాత్మకు వ్యతిరేకముగా దాని నొనర్పఁజాలను. ఒనర్పకున్న జరుగునది యిదియే కదా ! రామరాజ్య మిట్టిది యని కొన్ని నాళ్ళకైన జగమెఱుంగఁగలదు. శంబుకుని వధ, న్యాయమో, యన్యాయమో, నిష్పాక్షిక బుద్ధితో నంతర్వాణులు నిశ్చయింతురు గాత. చావునకు భయంపడిస్వత్వమును నశింపఁజేసికొందుమా ?

అంగ :- ఇట్టి దారుణకార్యములు జరుగకుండుఁగాక.

శంబు :- యువరాజా ! యిప్పటికే చాల ప్రొద్దుపోయినది. ఇంకేమయిన నున్నయెడల రేపు ముచ్చటించెదము. ఇంక నిదురింపఁ బొమ్ము.

అంగ :- చిత్తము. (నిష్క్రమించును.)

శంబు:- గీ. జగముకంటివేల్పు సర్వకృత్యములకు
సాక్షిగాఁగ నన్ను సాఁకుగాత
స్వల్పబుద్ధినగుట సతతంబు పరికించి
మంచిమార్గమందు నుంచుగాత ! ౧౧

(నిష్క్రమించును.)

ప్రథమాంకము సంపూర్ణము.



# శంబుక వధ
## (ఉత్తర రామచరిత)

ద్వితీయాంకము.

సాకేతపురము, రఘుఘంటాపథము, బ్రాహ్మణగృహము.

(అరుఁగుపై నాకులు కుట్టుకొనుచు సోమయాజి కూర్చుండును.)

సోమయాజి:- వషే, వషే! యేమిటి యీరొద? ఎల్లప్పుడు పదిమంది వేదపాఠముఁ జేయుచున్నట్లు లిల్లంతయు మాఱుమ్రోఁగుచుండును.

సోమిదేవి :- ఎప్పుడు నన్నొక్కటేవిధముగా నాడిపోసికొనుచుందురు. చైనులుగారువచ్చి మీరెక్కడనున్నారని యడుగఁగా జవాబుఁ జెప్పుచుంటిని. దానికింత బ్రహ్మాండముఁ జేయుచున్నారు.

సోమయాజి :- అట్లా చెప్పు. అదియా సంగతి? సరే.

చైనులు:-(ప్రవేశించి) సోమయాజులుగారూ! అరుఁగుమీఁద గూర్చున్నారా? ఏమిచేయుచున్నారూ యిచ్చట?

సోమయాజి:- ఓహో! చైనులుగారా? దయచేయండి, ఏమి చేయుటలేదండి. ఇంటిలోని పోరుపడలేక విస్తళ్ళుఁ గుట్టుచుంటి. ఈ వయస్సున నేపనిఁజేయఁబోయినను గష్టముగనే యుండును.

చైనులు:- (ఒకచేతితో నేలనానుకొనుచు నాత్రముతో) కొంప లన్ని కొట్టికొనిపోవుటకు సంసిద్ధముగా నున్నయప్పుడు మీ కీ శాంతమెక్కడనుండి వచ్చినదండి ? సాకేత పురమంతయు నాగుబ్బుగాఁ జెప్పుకొనుచున్న సంగ తులు మీ చెవినిఁబడలేదా ? ఎంత శాంతము ? ముసలితనము హెచ్చినకొలంది శాంతము కూడ హెచ్చుచున్నది. ఇదో సృష్టివైచిత్ర్యము.

సోమయాజి :- చైనులుగారూ ! మీ దంతయు నొకగోల. గ్రుడ్డికన్ను మూసిననేమి తెఱచిననేమియన్నట్లు, చెవి దగ్గర శంఖమూదినను వినఁబడని నాకు నూరిలోని సంగతులు తెలియఁగలవా ? వెఱ్ఱిగాని ?

చైనులు:- అట్లయిన మీరు మంచియవస్థలోనే యున్నారు.

సోమయాజి:- (విసుగుతో) మంచో ! చెడుగో ! కాని మీరు వచ్చినపని చెప్పరాదూ ?

చైనులు:-చెప్పుటకు మాత్రము నోరాడవద్దూ ? శాస్త్రకారుల మాటలప్పుడే నిజములగుచున్నవి చూచారా? శాస్త్ర కారులు తెలివి తక్కువవారా ? త్రికాలజ్ఞులుకాదూ?

సోమయాజి:- శాస్త్రముల యుబుసెత్తుచున్నావు. మన కిప్పు డేమి మూడినది ?

చైనులు:-ఏమి మూడినదా? మొన్నటిసంగతి విన్నారుకదా ?

సోమయాజి :- గురుదాసు పేలినమాటలా ? ఆఁ! విన కేమి ? తగిన ప్రాయశ్చిత్తమే యయినదికాదా ? కొఱుత వేయించినారు కదా. నీవు కండ్లారఁజూచినావా ? దుర్మార్గుల శిక్షించుపట్ల శ్రీరామచంద్ర భగవాను

నకు దయ యనుమాట యేకోశమందయిన నుండదు సుమా !

చైనులు:- ఈయప్రాచ్యపుముండ కొడుకులుశిక్షించిన కొలంది మొండివారగుచున్నారు. వీరు పెచ్చుపెరుగు చున్నట్లున్నది.

సోమయాజి:- క్రొత్తగా నిప్పుడేమి వాటిల్లినది ?

చైనులు:- ప్రాతఃస్నానముఁజేసి, సంధ్యావందనముఁ జేసికొనుటకు వేకువ జామువనే లేచి నేఁడు కకుత్స్థఘట్టమునకుఁ బోయితిని. నాకన్న ముందుగనే యొకఁడోడలెల్ల బూడిదపూసికొని వివిధకుసుమ పత్రసమాప్రవత్న్యుఁడై విఘ్నేశ్వరపూజఁ జేయుచుండె. కపరకప్పర చీకఁటులు నలుగెలంకుల నలముకొని యుండుటచేఁ జూడక యావినాయక విగ్రహముపైఁబడితిని. అంత నాతఁడు మండిపడుచు నన్నుఁ దూలనాడ నారంభించెను.

సోమయాజి:- చైనులుగారూ! దేవతా విగ్రహముపైఁబడుట దోషము కాదా ?

చైనులు:-దోషమేకాని, యాతఁడెవ్వఁడనుకొన్నారు? అతఁడు గురుదాసుని తమ్ముఁడఁట.

సోమయాజి:- అవురా ! ఏమని తూలనాడినాఁడు ?

చైనులు:-దేవపూజా విఘ్నముగావించుట మొఱకుల లక్షణమని యేమేమియో గొణిగినాఁడు.

సోమయాజి:-దారితప్పిపోయిన కొలంది యీముండకొడుకులు పైపైకి వచ్చుచున్నారు. దయా దాక్షిణ్యములు మాని వీరలను దల్లివేరులతోఁ బెకలించిపాఱవేయించ

వలయును. రామభద్రునకీ సంగతి తెలిసినదా? ఆర్షే యములగు శాస్త్రములను ధిఃకరించి గురుధనాపహార ణమునకుఁబూనిరిగాతుచ్ఛులు. ఇప్పుడే వీరిని గొఱుత వేయించవలయును. పెందలకడనే మేలుకొనుట యుక్తము.

చైనులు:- పుండొకచోటనున్న మందొకచోటవేసినఫలమేమి వీని నొక్కనిఁ దుదముట్టించిన లాభమేమి?

సోమయాజి:- నీవు చెప్పుచున్నమాటలు నాకర్థమగుట లేదు.

చైనులు:- ద్రావిడులయందు నూతనశక్తి యొండుద్భవిల్లినది. ఆర్యులతో సమానస్వత్వమును గోరుచున్నారు. దీని కంతకును మూలకంద మా శంబుకుఁడు. వానిని గడ తేర్చినఁగాని యీ యాందోళనము సమసిపోవదు.

సోమయాజి:- అయితే నీవు శంబుకు నెఱుంగుదువా? వాఁడెంతపనిఁజేయుచున్నాఁడు. తొల్లి తపోభంగమై ద్రావిడుఁడై పుట్టెనుగాఁబోలు.

చైనులు:-ఆఁ! యెఱుంగుదును. పరమసాధువు, విజ్ఞాని, పరా పకారముఁ దలపెట్టఁడు.

సోమయాజి:- నీ మాటలు చిత్రముగా నున్నవి. అట్లయినచో నిదియంతయు నేమిటి? ఎందులకు వచ్చినపని?

చైనులు:- ప్రజలందఱుసమానముగాఁ బరిపాలింపఁబడవలయు ననియు, సమానమగు హక్కులుండ వలయుననియు నాతని వాదము. అందులో మతవిషయమున నీషన్మా త్రమైన భేదముండఁగూడదని యాతనియభిప్రాయము. అందుచే నతఁడిట్లు చేయుచున్నాఁడు.

సోమయాజి :- అట్లయితే ఋషిప్రోక్తములగు గ్రంథము లన్నియు సున్నచుట్టవలసిన దేనా ?

చైనులు:- స్వత్వసామాన్యమునకుఁ బ్రతిబంధకములగు నీతు లన్నియు గర్హ్యములనియే యాతని యభిప్రాయము.

సోమయాజి:- ఓహో ! కొంపకు నిప్పుముట్టించుచున్నాఁడే ? అతఁడిప్పుడెక్కడ నున్నాఁడు ?

చైనులు:-మనపట్టణంబునకుఁ బరిసరంబుననే సరయూ నదీతీరమునఁ జిదానందాశ్రమమని పేరుపెట్టుకొని యొక యాశ్రమము నిర్మించుకొని తపస్సుఁ జేసికొనుచు, నప్పుడప్పుడు శిష్యులకుఁ దత్త్వోపదేశముఁ గావించుచున్నాఁడు.

సోమయాజి:- (మండిపడుచు) ఏమి ! తపస్సా ? శూద్రుఁడు, తపస్సా ? శిష్యుల కుపదేశములా ? ఏమి వింత ? రామరాజ్యములోనే యిట్టి వింతలా ? ఇప్పుడు మనము చేయవలసినది యేమి ? వెంటనే నిశ్చయింపుము.

చైనులు:- వీని నీ వైపుల లేకుండఁ జేసినఁగాని యీ గందరగోళము మానదు.

సోమయాజి:- ఈ వైపులనేమిటి ? వెనుక వచ్చువారికి మరల నొకపనియా ? ఈ లోకమున లేకుండఁగనే చేయవలయును. సరే ! నడువుము. నేనుగూడ వచ్చెదను. రామభద్రునికడకు వెళ్ళెదము.

చైనులు:- తొందరపడకుఁడు. ముందుగా వసిష్ఠులవారి కడకుఁ బోయి వారితో నాలోచించి కార్యము నడపెదము.

సోమయాజి:- సరే మంచి యూహే, నడువుము; ఈ విస్తర్లింటిలోఁ బడవేసి వచ్చెదను. (నిష్క్రమింతురు.)

(శ్రీరాముఁడు, హనుమంతుఁడు, అంగదుఁడు ప్రవేశింతురు.)

శ్రీరామ :- అంగదా! చిరకాలమునకు మమ్ము దర్శింప వచ్చితివి. వానర సార్వభౌముఁడు సుఖముగ రాజ్య మేలుచుండెనా? మమ్మెమయినఁ దలపోయుచుండునా?

అంగ :- దేవా! హసాదు. మీ యాజ్ఞాబద్ధుఁడై కాదా కిష్కింధాపురమున వానరసార్వభౌముఁడు రాజ్యము జేయుచుండుట? మిమ్ముఁదలంపని నిమిష మొక్కటి యయిన నుండునా? అందు సుగ్రీవ సార్వభౌముఁడు మిమ్ముఁ దలంపకుండునా? "ఆమరణాంతము కృతజ్ఞుఁడనై యుండఁదగిన సాహాయ్యము చేసితి"రని చెప్పుచుండును.

హను :- [తనలో] ఏమి యువరాజు మాటలు వ్యంగ్యప్రధానముగా నున్నవి. ఏలాకో? వీనిచర్య లనుమానాస్పదములుగాఁ గన్పట్టుచున్నవి.

శ్రీరామ :- కుమారా! అంగదా!! మేముచేసినది కడు నల్పకృత్యముసుమీ! మీ పినతండ్రి మిగుల ప్రబుద్ధుఁడగుటచే మాయందుఁ గడుంగడుఁ గృతజ్ఞుఁడై యున్నాఁడు.

అంగ :- [తనలో] నిజముగ నల్పకృత్యమే. [ప్రకాశముగా] దానికే రేయింబవళ్లాంతరంగికులతోఁ జెప్పికొని యుప్పొ

ళ్లూరుచుండును. దేవరవారికి నాకస్మికముగా వాటి
ల్లిన యాపత్తునకుఁ గుందికుంది వెంటనే నన్ను
మీకడ కంపెను.

శ్రీరామ :- అంగదా ! తీరరాని యిక్కట్టే కాని,

సీ. కాక పక్షంబులు గల్గని పసినాఁడె
దేశముల్ ఋషితోడ దిమ్మదిరిగి
కనులలోఁ బెట్టుక యనుకంప సాకిన
పితమరణంబుచే వెగటుచెంది
కడలేని యడవులఁ గాల్నడతోడ ని
ల్లాలితోడుత నడయాడి యాడి
కడుఁ గ్రొవ్వి కన్నులు గనక రావణుఁడు చే;
సిన పరాభవముచేఁ జివికి చివికి

గీ. యుండినను ధర్మసంస్థాప నోచితంబు
లైన యట్టి కార్యముపట్టు లందు జంక
మెపుడు రవ్వంతయేని యే మేని పెద్ద
దిగులు గొల్పెడు కష్ట మే తేరనున్న.

కాన రాజధర్మ పరిరక్షణంబుకై యర్ధాంగిని గూరాని
యడవుల కంపినందులకై పరితపింపము.

హను :- దేవా ! మీరనునది నిజమేకాని యొక్కసంగతి
మాత్రము విచారింపవలసియున్నది.

సీ. కన్నవారలనెల్లఁ గడకుఁ ద్రోసి మహాత్మ !
భవదాశ్రయముఁగోరి వచ్చెనయ్య

అక్కటకట ! యసూర్యంపశ్యయయ్యు మీ
తోడునీడవలె న ల్లాడెనయ్య
పలలాశికొని పోవఁ గలయందు సైతము
రేఁబవల్ మిము సంస్మరించెనయ్య
మీసంశయము తీర్చ నాసతోఁ దెగమండు
పాదనెక్కి కమలక బ్రదికెనయ్య

గీ. అట్టి సాధ్వీమతల్లి మా యమ్మ మూఁడు
లోకములతల్లి యక్కటా ! లుబ్ధకాళి
పంచఁజేరినఁ బక్కునఁ బగిలి నా హృ
దయము చావనైతినిగదా తత్క్షణంబ. ౨

శ్రీరామ :- ఆంజనేయా ! వెట్టియేడ్పు లేడ్చుచున్నావు. మేము విధించిన దండనచే మేము దోషముఁజేసితి మనియా నీయుద్దేశ్యము.

హను :- నే ననఁజాలనుగాని, మాయమ్మమాత్ర మాదండనకు నర్హురాలు కాదని యెఱుంగుదును.

శ్రీరామ :- అయిన మేముదోషముఁ జేసినట్లేకదా ! దీని నిదివఱకేల చెప్పకపోతివి ?

హను :- చెప్పనందులకు నామనస్సాక్షి నన్నుఁ బీడించుచునేయున్నది. ఇన్నిదినములనుండి నేను గంటఁ గూర్కెఱుంగుదునా ? మొన్న యాజగన్మాత స్వప్నమునఁదోఁచి కనుకొలుకులనుండి వేడికన్నీరు కాల్వలై పాఱుచుండఁగొనగోటఁజిమ్ముచుఁడగ్గుత్తికతో "కుమారా! యకలంకమైన నా చారిత్రమును, దుర్మార్గులకు దుర్జ్ఞేయమైన నాపాతివ్రత్యమును, నీ వెఱుంగవా!"

యనెను. నే నులికిపడి తల్లీ యెఱుంగ కేమి? ఈ దీనుఁడు మీ సన్నిధానమున నిల్చుటకయిన నర్హుఁడాయంటిని. అట్లయినచో "శ్రీరామచంద్రునితోఁ జెప్పి యేల వారి సంశయములనుదీర్పవ"నియెను. తల్లీ! తల్లీ! జగన్మాతా! నేనసమర్థుఁడను, నేనసమర్థుఁడను. అమ్మా! నేనెవఁడను? ఆమహానుభావునకు నొక సామాన్య సేవకుఁడను. నా మాటయందు వారికి గౌరవమెట్లుదయించు నంటిని! కుమారా! నీవు చెప్పునదియు నిజమే. రారాని పోరాని యడవులలోఁబడవలసిన యిడుములకు బీతు వడను. అన్యాయంబుగ నామెడకుఁ దగిలించిన యీ "నిరాపనింద" నెట్లుపాపుకొందునాయని దుర పిల్లుచుంటిని. ఇఁక నెవరు నాదిక్కు? మరల మిమ్ముఁ జూడఁగల్గుదునో లేదోయని యంతర్థానమయ్యెను. నాఁటనుండి నాకు నిద్రాహారములు రుచించుటలేదు.

శ్రీరామ :- ఓయీ! హనుమంతా! నీవు సూర్యవంశపు పరువుమర్యాద లెఱుఁగనట్లు మాటాడుచున్నావు.

హను :- ఎఱుంగకేమి మహాత్మా! ప్రాకృతజనంబులాడు మాటలు పాటించి వంశము కలంకము పాలగునని తలంచి, నిరపరాధయు సాధ్వీమతల్లియు నగు మా యమ్మను హేయమగు నిందపాలుసేయు టుచితమో? నేనెఱుంగనా? నాఁ డశోకవనమధ్యంబున మలిన జీర్ణాంబరములతోడను, సంస్కారశూన్యములగుటచే జడలుగట్టిన శిరోజముల తోడను దివారాత్రములు హా! రామ, హా! రామ, యనుచు మిమ్ముల ధ్యానిం

చుట, అట్టితల్లి కా యిట్టివాడు? త్రేతాయుగ లక్షణము కాఁబోలు.

అంగ :- దేవా! మేము చెప్పునంతటి వారము కాముగాని సీతామహాదేవి వనవాసముచేత సూర్యవంశమున కపకీర్తిగాని కీర్తి రానేరదని నాతలంపు.

శ్రీరామ :- [నిమీలితనేత్రుఁడై విచారించి] అంగదా! నీవాక్యములయందు సత్యము లేకపోలేదు. కాని "జనవాక్యమ్‌తు కర్తవ్యమ్" అను పల్కులఁ బాటింపవలసిన వాఁడనైతిని.

హను :- దేవా! యీనానుడి మాబోటి ప్రాకృతజనంబులకుఁ గాని మీవంటివారికిఁగాదు.

శ్రీరామ :- ఆంజనేయా! నీవుకూడ నీ నింద మానెత్తిపైనే పడవేయుచున్న వాఁడవా?

[ద్వారపాలకుఁడు ప్రవేశించి] మహాప్రభూ! వసిష్ఠులవారు తమ సందర్శనార్థమై వచ్చినారు. ఏమిసెలవు?

శ్రీరామ :- ఇంతకన్నను గావలసినది యేమున్నది? వెంటనే తోడ్కొని రమ్ము.

[వసిష్ఠుఁడు, చైనులు ప్రవేశింతురు. శ్రీరామచంద్రుఁడు పీఠముడిగ్గి] సూర్యవంశోద్భవుండును, శిష్యుఁడునగు రామభద్రుఁడు నమస్కరించుచున్న వాఁడు.

వసిష్ఠ, చైనులు:-వర్ణాశ్రమాచారపరిరక్షణసామర్థ్యమస్తు.

హను :- రామభద్రుని సేవకుఁడు హనుమంతుఁడు నమస్కరించుచున్నాఁడు.

వసిష్ఠ, చైనులు:- పుత్రపౌత్రాభి వృద్ధిరస్తు.

అంగ :- [తనలో] మా హనుమయ్య యెంత యదృష్ట వంతుఁడు ; పెండ్లియుఁ బెండ్లమును లేకుండఁగనే బిడ్డలమీఁద బిడ్డలను బొందఁ బోవుచున్నాఁడు. ఇందు లకు సంశయమేల ? బ్రాహ్మణులమాట రిత్తవోవునా? (ప్రకాశముగా) కిష్కింధాపుర యువరాజంగదుఁడు నమస్కరించుచున్నాడు.

వసిష్ఠ, చైనులు:- [తేఱిపాఱఁజూచి యాశీర్వదింతురు.]

శ్రీరామ :- ఇదిగో ! యిందు దయచేయుఁడు. (అంద రుప విష్టులగుదురు)

వసి :- రామభద్రా ! మనోవ్యాకులము లేకుండ రాజ్యముఁ బరిపాలించుచుంటివి కదా ? క్రొత్తవింత లేమియు లేవుకదా ?

శ్రీరామ:-మీ యాశీర్వాద బలమువలన ధర్మానుష్ఠానపరుఁ డనై ప్రజలు సంతుష్టిఁ బొందునట్లు రాజ్యము చేయు చునే యుంటిని. జగద్గురువులయిన మీరు మాయెడఁ బరిపూర్ణకటాక్షముగల్గియుండఁ బాలనయందుఁగొఱఁ తేమియుండును ?

చైనులు:- దేవా! సూర్యవంశము సాకేతపురసింహాసనము నం దున్నంతకాలము మాబోటివైదికులకుఁగొదవ లేమియు నుండవు. కాని (యాఁగును.)

అంగ :- (తనలో)యీముదుకండేదియో కైలాటముఁ దెచ్చి పెట్టుటకు యత్నించుచున్నాఁడు. శాంతముతో విని యెదను.

వసి :- చైనులుగారూ! మీరు కొంతతడవూరకుండుఁడు.
(రామునికిఁ గన్నసన్నఁజేయును)

శ్రీరామ - హనుమంతా! అంగదుఁడలసినయట్లున్నది. యువ రాజును విడిదలకుఁ గొంపోయి సత్కారములను గావింపుము.

హను :- అంగదా! మనము విడిదలకుఁ బోదుమురమ్ము.
(ఇరువురును బయలుదేరుదురు)

అంగ :- (తనలో) ప్రజ్ఞలకు లోపమా? వైదికము నందుఁగాక లౌకికమునందుఁగూడ వసిష్ఠులవారసాధారణులే. మేమే మియో విని పోదుమని చెప్పి యీ మిషచే మమ్మే వలకంపించుచున్నాఁడు. అయినను జిత్రము చూచి తీరవలయును. (హనుమంతునికై తిరిగి) యాంజనేయా! యిది నీవు రామాయణము నిర్మించుట యందుఁ బడ్డ శ్రమకుఁ బ్రతిఫలము గాఁబోలు.

హను :- అంగదా! యింకను నీకుఁ జిన్నతనము వదల లేదుగా! ఆర్యులను దిరస్కరింపఁగూడదు.

అంగ :- ద్రావిడులను దిరస్కరింపవచ్చునా?

హను :- కొంటెమాటలు మాని యిటువినుము. మనము సామాన్య సేవకులము. రాజులు రాజకార్యములను బహిరంగముగాఁ జర్చింపనొల్లరు.

అంగ :- అవును మనము సామాన్యసేవకులమే. అందు ముఖ్యముగా నీవు కిష్కింధాపురము వదలినప్పటినుండి సామాన్య సేవకుఁడవే యైతివి. లేకున్న నిక్కడికేల వచ్చెదవు? దీనికేమిగాని ముక్కుమూసికొని తపముఁ

జేసికొను నాబాపనితో రాజకార్యము లేముండునా యని వెఱఁగుపడి యిట్లంటిని. ఇందుఁ దిరస్కరణ మేమున్నది ? అయినను మనము సామాన్యసేవకులము గదా, మనకేల ? పోదము రమ్ము. (నిష్క్రమింతురు)

చైను :- (జనాంతికముగా వసిష్ఠునితో) యీనూతనజాడ్యము కిష్కింధాపుర యువరాజునకుఁ గూడ సోకినట్లున్నది.

వసి :- అనుమానముపడియే నేను వానిని నావలకంపు నుపాయముఁ జేసితిని. (శ్రీరామునితో) రామభద్రా ! కర్తవ్యాంశమునకు వత్తము.

శ్రీరామ :- చిత్తము. గురువుగారి వాక్యములు వినుటకు సిద్ధముగనే యుంటిమి. సెలవిండు.

వసి :- ఇప్పుడు క్రొత్తక్రొత్తగాఁ బ్రజలయందు రగులుచున్న కలవరము నెఱింగితివా ?

చైను :- ప్రజలయందుఁగాదు, ద్విజేతరులయందు.

వసి :- ద్విజేతరులయందేమి? వారిని సదమదించుటకు ద్విజులయందుమాత్రము లేదా ?

శ్రీరామ :- మేమంతగా నెఱుంగమే. దేవా ! యదిపదియో సెలవిండు. (అంగదుఁడు గాంధర్వవిద్యచేఁ బ్రవేశించి యదృశ్యుఁడై యొకమూలడాఁగి శ్రీరామ వసిష్ఠుల సంభాషణము వినుచుండును.)

వసి :- శ్రీరామచంద్రా ! రాజవై యుండియు, వేగులవారి మూలమున రాష్ట్రరహస్యములఁ దెలిసికొనుచుండుట లేదా ? ఎంతమాట ?

అంగ :- (తనలో) శ్రీరామచంద్రుఁడు నాఁడు చాకలివాని యింటిగుట్టు తెలిసికొనుటచేఁ గల్గిన యగచాట్ల కుందుచే మరల నట్టిపనికిఁ బూనుకొనఁడని నాతలంపు.

శ్రీరామ :- దేశికేంద్రా! యకస్మాత్తుగా సంభవించిన భార్యావియోగ దుఃఖముచే మతిచెడి రాజ్యకార్యములయందుఁ బ్రమత్తులమై యున్నారము.

వసి :- సూర్యవంశమునం దుద్భవించిన నీవలననెట్టి మాటలు వింటి. నీవు ధీరోదాత్తుఁడవు; ఇట్లు కుందఁదగునా? యిట్లాడఁదగునా? ఎన్ని సంకటములు సంభవించినను రాజధర్మమును నెఱవేర్చుట విధికాదా?

శ్రీరామ :- సూర్యవంశపుఁ బరువుమర్యాదలను నిల్పుటకే యీ యగచాట్లను ధైర్యముతో ననుభవించు చుంటిమి.

వసి :- నీ వీశ్వరాంశ సంభూతుఁడవు. కాన బ్రాకృతజనం బులట్ల మాటాడఁ జనదు. ఈ విషయమున వాల్మీకి మహాముని యభిప్రాయమును వినియుండలేదా? ఈశ్వ రావతారమని చెప్పుచున్నాఁడు.

అంగ :- (తనలో) ఇటువాల్మీకి రామాయణము విన్నాఁడు; అటు హనుమద్రామాయణమును విన్నాఁడు. కాని శ్రీరామచంద్రుఁడు తానింకను మనుష్యమాత్రుఁడో, యీశ్వరుఁడో నిశ్చయించుకొననట్లున్నది. ఒకవేళ రెండునుగాక త్రిశంకుతాతగారి స్వర్గవాసియేమో!

శ్రీరామ :- దేవా? క్షమియింపుఁడు. మనుష్యరూపముతో నున్న మేము మనుష్యులట్ల చరియింపవలదా?

వసి :- శ్రీరామచంద్రా ! నీవు సార్వభౌముఁడ వగుటంజేసి రాజధర్మమును విధ్యుక్తముగా నెఱవేర్పవలసి యున్నది.

చైనులు :- (పరులు వినకుండ) ఆ కోతిముండకొడుకేదియో మందు పోసినట్లున్నది. వాని మొగముఁజూచినప్పుడే నాకనుమానము గల్గినది.

అంగ :- (తనలో) తాతగారూ ! నాకు మంచిబిరుదే యిచ్చితిరి. అదియే నిజము కావలయు.

శ్రీరామ :- చిత్తము ! మీ యాజ్ఞాబద్ధులము.

వసి :- అటులయినచో రామభద్రా ! యిటు వినుము, నీవు రాష్ట్రసమాచారము లెఱుంగకుండినను, మేము మాత్ర మెఱుంగకుండఁజాలము. సాకేతపురరాజ్య శ్రేయస్కాములమయిన మేము దానిపట్లఁ బ్రాణము లయిన విడుతుము. నేఁడయోధ్యా పట్టణమంతయు గుసగుసలతోడను జిటచిటలతోడను నిండియున్నది.

అంగ :- (తనలో) ఏమిచెపుమా! వసిష్ఠ తాతగారి యవ్యాజ పరోపకారశీలత వెల్లివిరియుచున్నది.

శ్రీరామ :- కారణమేమి ?

వసి :- కారణమా ? ఎన్నఁడైన వింటివా శంబుకుని పేరు ?

శ్రీరామ :- మాకర్ణతాడితమైనట్లు కన్పట్టదు.

వసి :- నేఁటిదనుక మేమును వినియుండలేదు.

చైనులు :- అట్టి యల్పుఁడే యీ గుసగుసలకన్నిఁటికి మూల కారణము.

వసి :- ఇతఁడనార్యుఁడు; అనఁగా ద్విజేతరుఁడు; అనఁగా ద్రావిడుఁడు; అనఁగా మన స్మృతులు పేర్కొన్న శూద్రుఁడు.

చైనులు :- (సంతోషముఁబట్టఁజాలక తనలో) ఆహా! పూర్వ సముపార్జితమైన విద్యనంతయు నుపయోగపఱచుచున్న వారు వసిష్ఠులవారు. సమయమున కక్కఱకురాని చదువు చదువా?

అంగ :- (తనలో) వసిష్ఠుల వారందఱిని గలగూరగంప చేసి నారే.

శ్రీరామ :- అయిన నేమి?

వసి :- ఏమియు లేదు, శాంతముతో వినుము. త్రికాలజ్ఞులును, లోకాతీతులును, ప్రజ్ఞాచక్షువులునయిన తొల్లింటి ఋషులెల్ల వీరికి జప తపంబులు నిషేధించిరి.

శ్రీరామ :- జపతపంబులనఁగా భగవద్ధ్యానమే కదా?

వసి :- అగును. భగద్ధ్యానమే వీరికి నిషేధించి యార్యులగు ద్విజులకు సేవఁజేయ శాసించిరి.

శ్రీరామ :- ఋషులు మేలుకార్యమునే చేసిరి.

వసి :- ఇంతియకాదు, స్మృత్యనుసారముగా వర్ణాశ్రమాచారములను నిల్పి కాపాడు భారము క్షత్రియులం దుంపఁబడినది. సూర్యవంశ్యులగు క్షత్రియులెల్లరు ఋషుల యాదేశమును గ్రహించి పాటించి నేఁటి దనుక రాజ్యపరిపాలనంబుఁగావించిరి.

శ్రీరామ :- నేఁటిదనుక యనుచుంటిరి, మేమును మా పూర్వులు పోయిన పుంతనే పోవబద్ధకంకణులము.

వసి :- అట్లయిన వినుము, నేఁడీశంబుకుఁడు సాకేతపురమున కతిసామీప్యమున నొక యాశ్రమము నిర్మించికొని, ద్విజేతరులనుండి శిష్యులను గ్రహించి స్మృతులను ధిఃకరించి వారికిఁ దత్త్వోపదేశముఁ గావించుచున్నాఁడు. అంతటితో విరమింపక, పట్టణములకును బక్కణసీమలకును ఛాత్రులనంపి యార్యులతో సమానస్వత్వముకలదని శూద్రులకుబోధింపించు చున్నాఁడు.

శ్రీరామ :- మా ప్రజల కెల్లరకు సమానములగు హక్కు లుండుటుచితమే కదా.

వసి :- ఉచితమే స్మృతిసమ్మతమున్నంతవఱకు.

శ్రీరామ :- చిత్తము.

వసి :- అందుచే నీ పట్టణంబున, సాకేతంబున గర్వగ్రస్తులై శూద్రులు బ్రాహ్మణులను దిరస్కరించుటయే కాక వేదాధ్యయనంబునకుఁ గూడఁ గడంగుచున్నారు.

శ్రీరామ :- ఇప్పుడు మాకేమియాదేశము ?

వసి :- ఈ దేశము నీదికాదా ?

శ్రీరామ :- మాదియే.

వసి :- అటులయిన వర్ణాశ్రమాచారములను నిల్పనొల్లవా ?

శ్రీరామ :- నిల్పబద్ధకంకణులము, గాని మమ్మేమి చేయమందురు ?

వసి :- నీ రాజ్యమునకు రానున్న యీ ప్రమాదములను, నీ ముప్పును వైశమ తొలఁగింపవా ?

శ్రీరామ :- దానికి సందియమేల ? నేఁడేవర్ణాశ్రమాచారముల ధిఃకరించి విచ్చలవిడి వర్తించువారల నిష్ఠుర

దండన పాలు చేసెదమని శాసనమును ప్రచురించెదము.

వసి :- ఇట్టిశాసనమువలన నుపయోగములేదు. ఇది తాత్కాలికోపశమనముగల్గఁజేసినఁ జేయును. కాని శాశ్వతముగా నీ యుపద్రవమును దప్పింపఁజాలదు. ద్రావిడులందుద్భవించిన యీ యావేశమును మీ శాసనమిప్పటికి నణఁచిపెట్టినను, లోన గుమిలి గుమిలి యెన్నఁటికయిన బయల్పడక మానదు. ముందు మేల్కొనుట మేలు. ఒకరి నిర్బంధంబట్టి శిక్షించిన నుపశమిల్లునని తోఁచును.

శ్రీరామ :- ఎవ్వరిని ! ఏ శిక్ష విధించమందురు ?

వసి :- ఎవ్వరిని శిక్షించిన నేమి లాభమున్నది ? సామాన్య దండనమువలన మాత్రమేమి యుపయోగమున్నది ? ఈ మత ద్రోహుల గురువునుం బట్టియే మరణదండన విధించవలయును. ఇయ్యది కఠినశిక్షయని తలంపరాదు. ఇరుపక్షములవారి మేలుకొఱకే. అవయవముల యందొక్కటి దుష్టమైనదానిని ఖండించివైచుట వైద్యునకు విధి. ఇందు వేఱొండు తెఱవులేదు.

శ్రీరామ :- (నివ్వెఱఁగంది, కొంచెము విచారించి) మీ రీ మాటలు చెప్పను దగదు. మేము వినను దగదు. వేయేల ? వినఁజాలము. దుష్టశిక్షణంబున నాఱితేఱిన యీ హస్తము నిరపరాధుని ద్రుంపఁజాలదు.

వసి :- నిరపరాధుఁడనుచున్నాఁడవు. స్మృతి ధిక్కారముఁ జేసి మత ద్రోహముఁ గావించిన నీచుఁడెట్టి దండనకయిన నర్హుఁడే.

(హనుమంతుఁడు ప్రవేశించి యదృశ్యుఁడై యంగ దుండు కూరుచున్న స్థలమునఁ గూరుచుండఁబోవును.)

అంగ :- (తొలఁగి తనలో) పాపము! మా హనుమన్నకుఁ గండ్లు కనఁబడుటలేదు. ఇది బ్రాహ్మణ భక్తికిఁ బ్రతి ఫలము గాఁబోలును.

శ్రీరామ :- అటులయినచో మేము శంబుకుని సన్నిధాన మున కరిగి యాతఁడొనర్చుచున్నది మతద్రోహమని నచ్చఁజెప్పి మంచిమార్గమునఁ బెట్టెదము.

వసి :- మేమిదివఱకే యతనితో ముచ్చటించి యుంటిమి. అతఁడు మా మాటలను బెడచెవులను బెట్టుటయేకాక యనార్యులకుఁ గూడ మతమునందు సమానమగు స్వాత్వమున్నదని తర్కించి, ప్రాణమునయిన వీడుదును గాని యంతరాత్మకు వ్యతిరేకముగా నారబ్ధకార్యము లను విసర్జింపనని మొండిపట్టుపట్టి ఖండితముగాఁ జెప్పి నాఁడు. అందుచేతనే మీ సన్నిధానమునకు వచ్చి తిమి.

శ్రీరామ :- ధర్మసూక్ష్మములు మా బోంట్లకు దురవ గాహము. అయినను నింతకు మున్ననార్యులుకూడ బ్రహ్మత్వము గడించినట్లు విన్నారము. శంబుకుని వాక్యములయందు మత ద్రోహ బుద్ధి యున్నట్లు కన్పట్టదు.

వసి :- రామచంద్రా! పొరఁబడుచున్నాఁడవు. నీవు చెప్పు నవి కృతయుగమునాఁటి కథలు.

శ్రీరామ :- అయ్యా! యుగభేదముచే స్వాత్వము కూడ మాఱునా?

వసి :- దానికింకను సంశయమా ?

శ్రీరామ :- అట్లయిన నీ విషయమున దీర్ఘవిచారణముఁ జేయవలయును. అనాలోచితముగాఁ గార్యమునుఁ జేయఁజాలము. క్షమింపుఁడు.

హను :- (తనలో) శ్రీరామభద్రుఁడు సత్యమునే పల్కుచున్నాఁడు.

శ్రీరామ :- (ఆలకించి) ఎక్కడ నుండియో రోదనధ్వానములు వినవచ్చుచున్నవి.

ద్వారపాల :- (ప్రవేశించి) బ్రాహ్మణుఁడొక్కఁ డాక్రందనముఁ జేయుచు మొగసాలకడ నిలువఁబడియున్నాఁడు. ఏమి సెలవు ?

శ్రీరామ :- వెంటనే లోనికిఁ గొనిరమ్ము.

ద్వారపాల -: చిత్తము (నిష్క్రమించును) బ్రాహ్మణుఁ డొక్కఁడొక్క బాల శవంబుతో బ్రవేశించి యాత్రముతో రామునుద్దేశించి)

బ్రాహ్మణుఁడు :-

ఇనకులవర్యుఁడౌ రఘునరేంద్రుని దొట్టియు నేఁటిదాఁకనున్
జనకులుగల్గఁ బుత్రకులు చచ్చుటగానము సీతలాటమం
దునఘటియిల్లెఁగారణముతో చదుశూద్రుఁడెవండొ యెచ్చటో
తనమతధర్మముల్ విడచి తప్పుపథంబునఁబోవఁబోలెడిన్ 3

ఓ రఘురామ ! కట్టెదుట నున్నది బాలశవంబుఁజూడుమీ
పాటులఁ బ్రోవలేని నర పాలకు లేటికి ? మీదు పూర్వులె
వ్వారును విప్రభక్తి పరి వర్జితులెన్నఁడుగారు గావునన్
బాలుని బిడ్డకిచ్చెదవొ ప్రాణము! శాపమునే గ్రహింతువో!

అంగ :- (తనలో) ఏమీ యీ బెదరింపు; తన బిడ్డను బ్రతికించుకొనలేని యీ పాఱుఁడు శాపము నిచ్చునఁట, ఏమనియో !

వసి :- అకాలబాలమరణదందహ్యమానుఁడవైన యో యదృష్టహీనుఁడా ! చక్రవర్తిని దూలనాడకుము.

బ్రాహ్మ :- వసిష్ఠులవారా ! దుఃఖమున మునిఁగిన నేను మిమ్ముఁజూడఁజాలక యపచారమును జేసితిని. నమస్కారము. శాస్త్రవిహితముగా రాజ్యమేలఁజాలని చక్రవర్తిని దూలనాడ కేమి చేయఁ గల్గుదును ?

శ్రీరామ :- ఓ భూదేవా ! బ్రాహ్మణధర్మముగాని యీ కోపమేలపూనెదవు ? వాటిల్లిన యాపత్తు సవిస్తరముగాఁ దెల్పిన నది తీర్ప శ్రీరాముఁడు సంసిద్ధముగా నున్నాఁడు.

బ్రాహ్మ :- ఇతఁడు నా బిడ్డఁడు, లేక లేక కన్నసంతానము. నేఁ డకస్మాత్తుగా మరణించెను. కారణము మీరే యరయుఁడు.

అంగ :- (స్మృతినభినయించి యక్కజపాటుతో) ఔరా ! యారా ! యేమి యీ కుట్ర! ఏమి యీతంత్రము! ఏమి యీఛద్మకౌశలము! ఇప్పుడంతయునర్థమయినది. వసిష్ఠులవారెంత తంత్రజ్ఞులు. మొన్నసాయంకాలము, వసిష్ఠులవారశ్వినీ దేవతలతో గుసగుసలు వోవుటకుఁ గారణమిదియా ! భూదేవు లాకాశదేవు లొక్కటైరి. ఇఁక శంబుకర్షికిఁ బ్రాణములు దక్కుటెట్లు ? అశ్వినీ దేవతల సాహాయ్యమున నీ కుఱ్ఱవానిని మూర్ఛపోఁ గొట్టి శంబుకర్షి తపముచే మరణించెనని చెప్పవచ్చిరి.

ఎంత పొరపాటుఁ జేసితిని. మా సుషేణు తాతగారిని దీసికొనివచ్చిన యెడల నేదియో విఱుగుడిచ్చి లబ్ధప్రజ్ఞునిఁ జేయకుండునా! కట్టా యిప్పుడు నేనేమి చేయఁగలను. ఎంత మోసము. అయినను శ్రీరామచంద్రుఁడేమి చెప్పునో వినియెద.

శ్రీరామ :- (వసిష్ఠునికై తిరిగి) మహాత్మా! యిట్టి బాలారిష్టము దేనివలనఁ గల్గునో సెలవిండు.

వసి :- (దీర్ఘముగా విచారించి)

శ్లో॥ యస్యరాష్ట్రే నృపాలస్య తురీయశ్చ తపోధనః
తత్రతథ్యమ్ భవత్యేవ విప్రబాలస్యమారణమ్ ॥

శ్రీరామచంద్రా! యింకను సంశయమేల? ఏ రాజు రాష్ట్రమునందు శూద్రుఁడు తపస్సుఁజేయుచున్నాఁడో యచ్చటనే యకాలముగా విప్రబాలురకు మరణము సంభవించి తీరునని స్మృతివాక్యము చెప్పుచున్నది. ఇంతకన్నను మనకేమి తార్కాణము గావలయును?

హను :- (వినయముతో) దేవా! మీ వాక్యములు మాకుఁ బరమ ప్రమాణములు. సందేహింపవలసినయగత్యము లేదు. కాని యొక్క సంగతిని దెలియఁ గోరుచున్నాఁడను.

అంగ :- (తనలో) కట్టకడకు మా హనుమయ్యకుఁ గూడ నేదియో సందియము పొడకట్టినది. తఱుమఁగాఁ దఱుమఁగాఁ బ్రాణరక్షణకయి గొఱ్ఱెయయినను వెనుదిరిగి పొడుచునన్న సామెత యబద్ధమగునా?

చైనులు :- (కోపముతో) ఆంజనేయా! వసిష్ఠుల వారేల? నేనే సమాధానముఁ జెప్పెదను. ఆ సందియమేదియో తెల్పుము.

హను :- ఎవరైన నాకేమి స్వామీ? "అవశ్యమనుభోక్తవ్యమ్ కృతమ్ కర్మశుభాశుభమ్" అను వాక్యము చొప్పున శూద్రుఁడెవండేని యాత్మకులధర్మములవిసర్జించి ద్విజవిహితములగు కర్మముల నాచరించిన యెడలఁ దచ్ఛూద్రుఁడు పాపాగ్ని దగ్ధుఁడు కావలయును గాని ద్విజశిశువు మరణించునట్లు తటస్థించును? ఇటులయినచో ద్విజేతరులు తపంబుఁ జేసినయెడల ద్విజులు నామమాత్రావశేషులగుదురా? అధర్మ మాచరించుచున్న పశ్యతోహరుని మహాపాపముచే నెచ్చటనో యున్న పరులు నశింతురా? పాతకులను దమ పాపములు బాధింపవా? అజ్ఞుఁడనైన నాకేమియుఁ దోఁచుట లేదు.

అంగ :- (తనలో) మా హనుమన్న యెంతవాఁడైనాఁడు! వేదాంతము వెలిఁగించుచున్నవాఁడు, దొంగకు నీతులా?

చైనులు :- ఆంజనేయా! శ్రమపడి ప్రశ్నవడిగితివి కాని నీకు శాస్త్రచర్చ చేయునధికారము లేదెఱుంగుదువా? మాబోంట్లు ధర్మసూక్ష్మములను నీకుఁ జెప్పను దగదు, నీవు వినను దగదు.

అంగ :- (తనలో) మా హనుమయ్య తలతిక్క వదలినట్లున్నది.

హను :- అయ్యా ! మా కెందులకుఁ జెప్పఁగూడదో యిప్పుడు తెలిసినది.

వసి :- (రాము నుద్దేశించి) వింటివా రాఘవరామచంద్రా ! యాశ్రమ సాంకర్యంబునఁ గల్గు దుర్నయములు ! మనము విన్నదానికిని నేఁడు కన్నదానికిని సరిపోయినది. ఇది తప్పక శంబుకుని తపశ్చరణ ఫలితముగా నోపు. నిర్నిమిత్తంబుగ నిట్టివి గలుగవు.

అంగ :- (తనలో) ఇంక నే నిచ్చట నిలువఁ జాలను. మానవుఁ డెట్టి కార్యములను జేయఁగలఁడో నేఁడు తెలిసినది. (నిష్క్రమించును.)

శ్రీరామ :- మునీంద్రా ! నా మనంబింకను సంతృప్తి పడకున్నది. నిర్జనమైన యరణ్యసీమ తపంబుఁ జేసికొనుచున్న శంబుకునకును నీ బాలమరణంబునకును గార్యకారణ బాంధవ్యంబు గుర్తింపఁజాలకున్నాఁడ.

వసి :- మనమిప్పుడు సేయుచున్న కర్మమునకు నుత్తర జన్మమునకును సంబంధ బాంధవ్యములెట్లు చెప్పెదవు ? కొన్ని యెడలఁ గార్యకారణ సంబంధమూహింపఁదగినది. అదియుంగాక వంశగురువునగు నేను చెప్పుచున్నాఁడను. ఋషిప్రోక్తములగు శాస్త్రములను జూపించుచున్నాడను ఇంకను సంశయమేల! నాఁడు పరబ్రహ్మయగు విశ్వామిత్ర వాక్యములయందు విశ్వాసముంచి తాటకిని వధింపలేదా ?

హను :- (తనలో) క్రమక్రమముగా నెత్తిపొడుపులోనికి దిగుచున్నదే తాతగారిపని.

శ్రీరామ :- స్వామీ ! యది నరహంత.

వసి :- ఆ|త్రముతో నితఁడు |బ్రాహ్మణహంత. స్మృతి ధిక్కారముచే |బ్రాహ్మణవధఁ జేసినాఁడు. ఎవ్వరెక్కుడు పాపకర్మలో యోజించుకొనుము.

|శ్రీరామ :- ఇది నిజమయినచో వెనుదీయను.

వసి :- నిజము కాకేమి ? లెమ్ము; కీర్తి కాముఁడవుకమ్ము.

హను :- (తనలో) నిరపరాధునిఁ జంపి |శ్రీరామచం|ద్రుఁడు యశస్వికావలసి వచ్చెనుగా.

|శ్రీరామ :- మీ వాక్యములఁ |బతిఘటింపఁజాలను. మీ యాజ్ఞను నెఱవేర్చెద.

హను :- (తనలో) తఱచిట్టి కార్యములు నా నెత్తిపై నే పడుచుండును. |శ్రీరామచం|ద్రుఁడు నన్నీపనికి మా|త్రము నియోగింపకుండునుగాక.

వసి :- సూర్యవంశజులెన్నఁడు గురుతిరస్కారముఁ జేయెఱుఁగరు. నీవాచం|ద్రార్కము రాజ్యమేలుదువుగాక.

చైనులు :- జయతు, జయతు.

|శ్రీరామ :- శంబుకుని మాసన్నిధానమునకు రప్పించి కొన్ని |ప్రశ్నములడిగి మఱి మీ యాజ్ఞ నెఱవేర్చెదము.

వసి :- నీ యిష్టము వచ్చినట్లాచరింపుము. ఒక్క సంగతిఁ జెప్ప మఱచితి. శంబుకుని వధతో నీ |బ్రాహ్మణ బాలశవంబు పునర్జీవితము కాఁగలదు.

|శీరామ :- దీని సత్యాసత్యములు పరీక్షింపఁగలము.

వసి, చైనులు :- ఇఁకమాకు సెలవిప్పింపుము.

|శీరామ :- చిత్తము.

(నిష్క్రమణము.)

ద్వితీయాంకము సంపూర్ణము.

# శంబుకవధ

## (ఉత్తర రామచరిత)

### తృతీయాంకము.

చిదానందాశ్రమము.

(అంగదుఁడు, శంబుకుఁడు ప్రవేశింతురు.)

శంబు :- యువరాజా ! నీవు వెఱ్ఱిబాగులవాఁడవుసుమా ! శ్రీరామచంద్రుఁడు నన్నుఁజంపుననియా నీకీ దుఃఖము? నా మరణమువలన నార్యులకుఁ గలుగు లాభముకన్న ననార్యులకుఁగలుగు లాభము మెండుగ నుండునని నీ వెఱుంగవా ?

అంగ :- మహాత్మా ! యిదియెట్లు ?

శంబు :- నా మరణము ద్రావిడ సంఘమునందు నూతన జీవము కల్పింపదనియా నీ నమ్మకము ? ఆత్మాభిమానముగల ప్రతిజాతికిని ఘోరదండనము స్వాతంత్ర్య రక్షణాశక్తిని బుట్టించును.

అంగ :- ఇది యాత్మాభిమానముగల జాతిలక్షణమని మీరు సెలవిచ్చితిరి. ఇది యనార్యులమయిన మనకు నన్వయించునాయని యరియాడుచుంటిని.

శంబు :- అనఁగా ద్రావిడులకు నభిమానములేదనియా నీయూహము. తొల్లింటి మనపూర్వుల చరిత్రముఁ జదివిచూడుము. ఆర్యులకు ననార్యులకుఁ బ్రవర్తిల్లిన భయానకరణంబులవంక క్షణకాలము నీమనోనేత్రమును బ్రసరింపఁజేయుము. ఈయుద్ధములన్నియు నేటికి సంభవించినవనుకొంటివి ? మూలకారణమును యోజింపుము. నీసంశయములు పటాపంచలగును.

అంగ :- ఆర్యులకు ననార్యులకు జరిగినవి యుద్ధములని తలపోయను. దేహదార్ఢ్యముకలిగి విదేశములనుండి తండోపతండములుగ మనదేశముపైఁబడి దేశమును గొల్లఁగొట్టుచు మన పూర్వులవెన్నాడునప్పుడు యుద్ధములెట్లు పొసంగును ? ప్రత్యర్థినిల్చినప్పుడుకదా సమరము. యుద్ధములేకుండఁగనే చేతనైనంతవఱకు నార్యులనార్యుల నులిమివేసిరని నాయాశయము.

శంబు :- కుమారా ! యంగదా ! మనపూర్వులు భీరువులనియా నీయాశయము. ఎంత వెఱ్ఱిపడితివి ? ఆర్యులతో హోరాహోరింబోరి, కచాకచింబెనఁగి, బాహాబాహిందొడరి తుముల సమరంబుఁజేసిన వారలు మన పూర్వులు. నీవన్నట్టులార్యులు శీతలదేశమునుండి వచ్చుటచే మిగుల శరీరసత్వముకలవారగుటచేతను, రణధర్మములఁ బాలింపకుండుటచేతను దుట్టతుదకు విజయముఁ గాంచిరి. అనంతరము నీవనినది జరిగినది. ఎక్కడికోపోవుటేల ? రావణుఁడు బలపరాక్రమసంపన్నుఁడా ? లేకరజ్జులాఁడా ? మీసాహాయ్యము లేకున్న

రాముఁడేమయినఁ జేయశక్తిమంతుఁడగునా ? మీంతో డ్పాటుమాట యటుంచుము. జాతిద్రోహియుఁ, గుల ద్రోహియు, వంశద్రోహియు, భ్రాతృద్రోహియునగు, విభీషణుఁడు రాజ్యకాంక్షచే నింటిగుట్టు తెలుపకున్న రాముఁడు వ్యర్థప్రయత్నుఁడగువాఁడా లేదా ! తుదకు మరణధర్మముఁ బాటించి రావణునిఁ జంపగల్గె నారాముఁడు ?

అంగ :- దేవా ! యిదిసత్యమేకాని రావణునిమాటఁ దలపెట్ట కుఁడు. మీవంటివారు తలపెట్టఁదగిన నామముకాదు. అతఁడు నీచుడు, పరభార్యాపహారి.

శంబు :- కుమారా ! నిజమేయనుకొనుము, అతఁడు నీచుఁడే: ఆ నీచునియందు నొకగుణమున్నది కనిపెట్టఁగల్గితివా ?

అంగ :- దేవా ! వానింగూర్చి ప్రసంగింపకుఁడు. క్రోధము రగులకుండ వానింగూర్చి వినఁజాలను.

శంబు :- ఇదిగో ! యీయొకమాటనేవినుము. తొందరపడి వివరమును బాడుచేసికొనకుము. దాన లాభము గల్గఁబోదు.

అంగ :- అటులయినచో సెలవిండు, వినియెదను. ఆసుగుణమేది ?

శంబు :- రావణుఁడు సీతామహాదేవిని దొంగిలికొని పోయి నాఁడనియేకదా యాతఁడు నీచుఁడంటివి.

అంగ :- అగును ; అందుచేతనే.

శంబు :- కొనిపోయి ఏమిచేసినాఁడు ?

అంగ :- ఆమహాపతివ్రతను బెట్టరాని బాములుబెట్టినాఁడు.

శంబు :- బాములు పెట్టినాఁడుగాని యామహాపతివ్రత పాతివ్రత్యమునకు లోపము గల్గించెనా ?

అంగ :- అది వాని సుగుణముకాదు. దానికిఁగారణమాజనని సౌశీల్యము, నాత్మబలము. సాధ్యమైనచో నానీచుఁడు చేయరాని పాపకార్యమొకటుండునా ?

శంబు :- దిక్పాలకజేత యపకారము దలంచుకొన్నచో దిక్కుమాలినయబల యేమిచేయఁగలదు? యోజింపుము. ఇదివానిసుగుణమో దుర్గుణమో ?

అంగ :- దీనికి నేనేమియుఁ జెప్పఁజాలనుగాని, పరస్త్రీని దొంగిలికొనిపోవుట పాపకార్యముకాదా ! అనంతర మెంతనీతితో వర్తించిననేమి? దుష్పథముకాకుండునా?

శంబు :- దీనికిఁగల కారణములనుగూడనాలోచించి యవల నీకుఁదోఁచిన తీర్పుఁజెప్పుము. రాముఁడు నిష్కారణముగా ననార్యులనందఱిని దెగటార్చుటకు ఋషులతోఁ బంతముపట్టెను. ఇదిన్యాయమో !

అంగ :- నిష్కారణమేమి మహాత్మా ? ఆఋషులకు నీద్రోహు లెన్నెన్నియో యపచారములుచేసి యాపదలు గల్గఁజేసిరి.

శంబు :- వీరుచేసిన యవినీతికార్యములుదలపెట్టవా ? వీరు నిజముగ బ్రహ్మజిజ్ఞాసువులనియా నీయభిప్రాయము?

అంగ :- అగును, బ్రహ్మజిజ్ఞాసువులనియే నాయభిప్రాయము.

శంబు :- నాయనా ! వినుము. నీయభిప్రాయము సరియైనది కాదు. ఆర్యచక్రవర్తులచే ననార్యరాజులగుట్టుమట్టు

కనుఁగొనుటకు దక్షిణాపథంబునకుఁ బంపఁబడిన యోగి వేషధారులయిన ఛద్మవిద్యాపారంగతులు. తమనీచ కార్యములకు మతమును గప్పడముగాఁ జేసికొనిన మృషాసంయములు. వీరు దక్షిణాపథమున నచ్చటచ్చటఁ బల్లెలుగట్టుకొని శిష్యపరంపరలమూలమున వార్తాసంగ్రాహణముఁ జేయుచారులు. వింధ్యోత్తర భూములనుండి మనపూర్వుల వెడలఁదఱిమి, దక్షిణాపథమునఁగీచుమను కాఱడవులలోఁ జెట్టుగుట్టలఁ బుట్టలఁబట్టించియు నచ్చటనైన నిలువనీడ లేకుండఁ జేయుటకేర్పడిన కొఱముట్లు. ఇయ్యది సత్యమని వీరి పూర్వచరిత్రంబులయందుఁ బెక్కుచోట్లఁ దార్కాణముఁ జూపనగును. దీనికంతయు మూలకందము జాతివైషమ్యము. సామ్రాజ్యములు దగ్ధపటలముఁ జేసి మానవుని సామాన్యస్వత్వమైన స్వాతంత్ర్యమునకుఁ బ్రతిబంధకముఁ గల్పింప నొడిగట్టుకొన్నవారిని దమ దేశమునుండి వెడల నడచుటకయి యత్నించుట పాపమో, దోషమో, రాజనీతివిరుద్ధమో యోజింపుము. (అంగదుఁడు దిగ్భ్రాంతితో వినుచుండును. శంబుకుఁడావేశముతో నంగదుని మోమునందుఁ జూడ్కి నిల్పి) మీ తండ్రి ఋషులకుఁగాని, సాధువులకుఁగాని యేమిద్రోహము, నేమి యపకారముఁ జేసినాఁడని రాముఁడు పొదమాటునడాఁగి ప్రాణముఁ దీసెను ? (అంగదుఁడు నిరుత్సాహముతో నూరకుండును.) పల్కవేమి యంగదా ?

అంగ :- (మెల్లఁగా) ఆడినబాస నెఱవేర్చుకొనుటకు.

శంబు :- (ఉద్వేగముతో) అంగదా! స్ఫుటముగఁ బల్కవేమి? ఆడినబాస నెఱవేర్చుకొనుటకా? అంత నీతిశాలియా? రావణుఁడు లక్ష్మణుని మహాశక్తితో మూర్ఛాలసునిఁజేసినప్పుడు రాముఁడు మీ ముందట మీ పినతండ్రితోడను, విభీషణుని తోడను జెప్పిన వాక్యములేవి? ఆడినబాస నెఱవేర్తుననియా? అసమర్థుఁడఁబ్రతిన నెఱవేర్పలేననియా? చెప్పవేమి? జ్ఞాపకములేదా? ♦ (అంగదుఁడు నిరుత్తరుఁడై యుండును, శంబుకుఁడు సముద్వేగమువలన జనించిన కంపితస్వరముతోఁ జురుకుచూపులంజూచుచు) కుమారా! యిది యిటులుంచుము, పరోపకారార్థము ప్రతినపట్టుట మేలుగాని యాత్మ లాభమునకై ప్రతిన పట్టితినని నీచకార్యమునకు నొడిగట్టుట ధర్మమా? ప్రతిజ్ఞాపూర్వకములయిన నీచకార్యములన్నియు, నిర్దోషములును, నిష్కళంకములును నిర్మలినములును నగునా?

అంగ :- దేవా! నేను గర్తవ్యతామూఢుఁడనైతి, ముగ్ధుఁడనైతి. మీ వాక్యములఁ బూర్వపక్షము సేయఁజాలను, జేయనొల్లను. (ప్రకంపిత స్వరముతో) ఆనాఁడు రాయబారిగా లంకాపట్టణముఁ బ్రవేశించి యాప్తవర్గముతో నిండు కొలువైయున్న రావణుని ఓజస్తేజములు నా కన్నుల మిఱుమిట్లు గొలుప నా సభాంగణమున

♦ భానుజ! సేనఁగొంచుఁ గిష్కింధకు నేగు నాపలుకు ♦ సెల్లదు నీవును బోవిభీషణా! భాస్కర రామాయణము,

నఱజాము నిస్పృహుండనై, నిలువఁబడితిని. తుట్ట తుదకు నడచుచున్నది ధర్మమార్గమని చెప్పి నిందా వాక్యము లాడితిని. మా హనుమన్న మాత్రమో రావణుఁడు మూఁడు లోకములను బరిపాలించుటకుఁ దగిన వాఁడని నాతో రహస్యముగా నొకనాఁడు చెప్పెను.

శంబు :- కుమారా ! యింకొకమాట వినుము. రావణుఁడు నీచుఁడే నీచతరుఁడే నీచతముఁడే; కాని యట్టి నీచుని సబాంధవముగాఁ జంపిన యనంతరము శ్రీరామచంద్రు నకు వాటిల్లిన యాపత్తేమి ?

అంగ :- (విచారించి) నే నెఱిఁగినంతవట్టునకు నాపత్తేమియు లేదు.

శంబు :- లేదా ? అటులయినచో రామలింగేశ్వరస్వామి ప్రతిష్ఠకుఁ గారణమేమి ?

అంగ :- జ్ఞాపకమునకు వచ్చినది. రావణవధచే శ్రీరాము నకు బ్రహ్మహత్యా మహాపాతకము చుట్టుకొన్నది యఁట.

శంబు :- (ఎకసెక్కెమును దెల్పు చిఱునగవుతో) నీచుని జం పుటచే బ్రహ్మహత్య యెట్లు సంభవించును ? బ్రహ్మ జ్ఞానియైనప్పుడుకదా తద్వధచే బ్రహ్మహత్యాపాతకము తటస్థించును. నీచకార్యములు చేయువాఁడు బ్రహ్మ జ్ఞాని యెట్లగును ? విచారింపుము.

అంగ :- స్వామీ ! క్రమక్రమముగ సర్వమును నా మనో నేత్రములకు విశదపడుచున్నది.

శంబు :- అంగదా ! యింకొక్క సంగతిఁ జెప్పమఱచితిని. వాల్మీకి మహాముని యసాధారణ శేముషీధురీణుఁడు. రావణుఁడు మహాపాతకియని ఋజువుచేయుటకు రావణుఁడు సీతాదేవిని బలత్కారముగా మానహానిఁ జేయ మిక నేదోయొక శాపము నాటంకముగాఁ గల్పించి లోకులను విభ్రమపాలు జేయఁగలఁడని నాకుఁదోఁచుచున్నది. అయినను మనము నిజమును గొలఁది దినములలోనే జూడఁ గల్గుదుము.

అంగ :- (వినయముతో) దేవా ! మీ మనస్థైర్యమే మీ నిశ్చితార్థమును సంపాదింపఁ గలదు. ప్రాకృతజనంబులకు మీచరిత్రము దురవగాహము. ద్విజులు మిమ్ముఁ బాషండుఁడవనియు, మతద్రోహివనియు దెగడుదురు. ద్విజేతరులో విద్యాగంధము లేమిచే బ్రాహ్మణద్వేషివనియుఁ దన్మూలమున రాజదండనకుఁ బాత్రుడవనియు గొణుగుదురు. కట్టకడకు మీరిరు తెగలకుఁ గానివారగుటయే ఫలితము. మీ మహత్వతత్వముఁ దెలిసికొనఁజాలక ద్విజేతరులు కృతఘ్నులగుటయే కాక కృతాపరాధులగుచున్నారు.

శంబు :- యువరాజా ! తెవులుగొంటునకు మందు రుచింపదని చెప్పి స్వాదు పదార్థము నొసంగుట యుక్తమో ! నే నెందులకుఁగాను పోరాడుచుంటినో ద్విజేతరులు కొన్ని నాళ్ళకయినఁ దెలిసికొనకపోదురా ?

అంగ :- (పొరలి వచ్చుచున్న దుఃఖముతో) నిన్న శ్రీరామభద్రుని సభాముఖమున జరిగిన చర్చను బరిశీలింప

నీకుఁ జిరకాలము మీ సందర్శనభాగ్యము మా బోం ట్లకు దొఱకదని సందేహము పొడముచున్నది. మీరీ సాకేతము విడిచి దక్షిణాపథమునకు వచ్చి యచ్చో మా సేవల నంగీకరించుచు నజ్ఞానాంధులఁ దరియింపఁ జేయరాదా ?

శంబు :- ఏమి నీ వెలితనము ? దక్షిణాపథమునకు వచ్చు టకు నభ్యంతరమేమియు లేకపోవుటయే గాక నాకు సుగ్రీవ సార్వభౌముని సందర్శన లాభము కూడఁ గల్గును. అయినను నిజముగ శ్రీరామచంద్రుఁడు నా ప్రాణమునకుఁ దెగిన యెడల దక్షిణాపథమునకుఁ దరలి నంతమాత్రమున నేను దప్పించుకొనఁ గల్గుదునా ? ఇదియెట్లయినను నేనిచ్చట నీ యాశ్రమ స్వీకారముఁ గావించుట యాత్మలాభమునకే యనుకొంటివా ? అట్లుకాదు. నా యీ కృత్యము వలన ద్రావిడు లందఱు మేలు పొందవలయునని యభిలాషము. కాకున్నచో నే నే దుర్గమారణ్యమందో నిష్ఠురతపో నిష్ఠాగరిష్ఠుండనయి కైవల్యముఁ బొందఁజాలనా ? మఱియు సనాతన ధర్మ రక్షకుఁడను బిరుదంబుఁ దాల్చిన శ్రీరామచంద్రుని సన్నిధానముననే యీ స్వత్వము నిరూపించుకొనఁ జాలుటో లేక స్వత్వ ముతోపాటు ప్రాణమును గోల్పోవుటో తటస్థింప వల యును. రామరాజ్యములో మనము దొంగతనముగా భగ వద్ధ్యానముఁ జేసికొనవలసియుండునో బాహాటముగాఁ,

బహిరంగముగాఁ జేసికొనసర్వులమో స్థిరపఱచి కొనుటకే మేమీ సాకేతపుర ప్రాంతసీమలయందు మల్లాడుచున్నాము. రాజు బ్రాహ్మణవాక్యములఁ దిరస్కరించి మతరక్షణమే చేయునో, పురస్కరించి హితరక్షణమే చేయునో, చూడవలసియున్నది.

అంగ :- అమంగళము ప్రతిహతమగుఁగాక. దేవా ! మీ యాదర్శము సామాన్యులకు దుర్జ్ఞేయము. మీభావము గభీరము. మీ మానసము కారుణ్యరసాప్లుతము. అఖిలవస్త్వంతర్యామియగు నీశ్వరుఁడు మిమ్ముఁ బాలించి మీ యారబ్ధ కార్యమును నెగ్గించునుగాక. మగిడి కిష్కింధాపురమునకుఁ బోవు తలంపున శ్రీరామచంద్రునికడ సెలవంది కొన్నిసంగతులుమీకుఁ జెప్పి పోవువాఁడనై యిచ్చటకు వచ్చితిని.

శంబు :- కుమారా ! చెప్పవైతివా సంగతులను, విన ముచ్చటపడుచుంటిని.

అంగ :- మహాత్మా ! నోరాడకున్నయది. చెడుమాటలు చెప్పవలసిన వాఁడనైతిని.

శంబు :- ఏమి నీవెఱ్ఱి ? తెగించినవానికి సముద్రము మోకాలి బంటికాదా ? ప్రాణమున కాశింపనినాకుఁ జెడుమాటలుండునా ?

అంగ :- ఋషిచంద్రమా ! వశిష్ఠులవారి కుట్రచే నోషధీ సాహాయ్యమున నొక బ్రాహ్మణ బాలుని విసంజ్ఞుఁజేసి కొలువునకుఁ గొంపోయి మీయాశ్రమ వ్యత్యాసముచేఁ గల్గిన ఫలమని శ్రీరామచంద్రునకు నచ్చఁ

జెప్పిరి. నచ్చఁజెప్పి మిమ్ము శిక్షాపాత్రునిఁ జేయుటకు యత్నించుచుండ నేను జూడఁజాలక మీకడ కరుదెంచితిని.

శంబు :- (అలక్ష్యభావమును సూచించు నగవుతో) కోటిలోఁదలదూర్చి రోఁకంటిపోటునకు వెఱవనగునా? ఈ కార్యవిధానమంతయు నూహింపనిదికాదు. కానఁ బిరుతివియవలసిన పనిలేదు. పాపము వసిష్ఠులవారి కెట్టి యవస్థవచ్చినది?

అంగ :- దేవా! ప్రొద్దెక్కుచున్నది. అనుజ్ఞయిత్తురా? [సాష్టాంగనమస్కారముఁ జేయును.]

శంబు :- [లేవఁదీసి] కుమారా! కృతార్థుఁడవుకమ్ము, సుఖమునఁబోయిరమ్ము.

అంగ :- (కన్నుల నీరునించుకొని డగ్గుత్తికతో) ఎన్నఁటికో పునర్దర్శనము? సంయమీంద్రా! యీ శిష్యునిసేవ నంగీకరింప నిచ్చగలదేని గాంధారి మాంధారి ప్రొద్దు వేళఁ గబురంపినను మీపదసన్నిధి వ్రాలుదును.

శంబు :- పరోపకారబుద్ధి మహనీయుల లక్షణముకదా! పునర్దర్శనమైనను గాకున్నను బరస్పరసంభాషణము మాత్రము మఱచిపోకుము.

అంగ :- దేవా! మీయాశీర్వాదమే నాకు జీవగఱ్ఱ. పని వినిమెదను.

శంబు :- (తటాలునలేచి యంగదుని గౌగిలించుకొని గద్గద స్వరముతో) కుమారా! పోయిరమ్ము. సుఖమునఁ బోయిరమ్ము. (అంగదుఁడు నిష్క్రమించును. శంబు

కుఁడు చింతామగ్నుఁడై కూరుచుండ శిష్యుఁడొక యుత్తరముతోఁ (బ్రవేశించి) దేశికేంద్రా! ఇదిగో! శ్రీరామచంద్రుఁడు మీకయియంపిన యుత్తరము. (అందియిచ్చును) ఏమిసెలవిత్తురో! వాకిట సేవకుఁడు వేచియున్నాఁడు.

శంబు :- (ఉత్తరమును దీసికొని విప్పుచు) బ్రహ్మదాసా! మనమనుకొన్నది యనుకొన్నట్లు జరుగుచున్నది. ఈయుత్తరమును నీవుచదువుము. వినియెదను. అక్షరములు బాగుగాఁగనపట్టుటలేదు. (ఉత్తరము శిష్యున కిచ్చును ; శిష్యుఁడంది పుచ్చుకొని చదువును.)

శ్రీసాకేతపుర సింహాసనస్థిత పట్టభద్రుండును, సూర్యవంశ సముద్భూతుండును, సనాతనధర్మ సంరక్షకుండును, వర్ణాశ్రమాచారపరిపాలనబద్ధకంకణుఁడును నగు దాశరథ శ్రీరామసార్వభౌముండు శంబుకునకుఁ దెలియఁజేయునది :-

నీవు వైదికధర్మవిరుద్ధకర్మరుండవై, స్మృతి విహితమయిన ద్విజసేవఁద్యజించి, ద్విజ కర్మంబు లనుష్ఠింపుచుండుటయేకాక వేదాధ్యయనాధ్యాపక ప్రముఖ బ్రాహ్మణానుష్ఠేయములకు స్వత్వమున్నదని శిష్యులంగూర్చి బోధింపుచు, మతద్రోహముఁ గావింపుచున్నాఁడవని మాశ్రుతిపథమునఁబడినది. మేము ధర్మమార్గానుచరులమగుటచే సభాముఖంబున నీస్వత్వమును రూఢిపరచుకొనుట కధికారమిప్పించుచున్నాము. కావున నీవు మూఁడుయామములకు నొడ్డో

లగము జరుగనై యున్నది. వేదవేదాంగపారంగతు
లను. సర్వశాస్త్రనిష్ణాతులను రప్పించుచున్నాము.
స్మృతివిహితధర్మతిరస్కారులకు మరణదండన శాస్త్ర
చోదితమని తెలియఁజేయుచున్నాము. (శిష్యుఁడు
గురువును దేఁటిపాటఁ జూచుచుండును.)

శంబు :- కుమారా! నీయుద్దేశ్యమేమి? ఈపండితపరిషత్తు
నకు శాస్త్రచర్చకై పోదుమా?

శిష్యుడు :- పోవుటయే యుచితమని తోఁచుచున్నది. రహ
స్యముగ మనమెన్ని బోధించిననేమి? ఎన్నఁటికయిన
మనవాదము బహిరంగము కావలసియే యున్నదికదా.
కానఁ దరుణము వచ్చినప్పుడు మనమేల వెనుకాడ
వలయును? ధర్మాధర్మవిచక్షణకర్తయగు శ్రీరామ
ప్రభుని మధ్యవర్తిగనుంచికొని యార్యులతో ముఖా
ముఖిశాస్త్రవాదముసల్పి, యొడిచిపుచ్చి, మనహక్కు
లను బలిమిమై గుంజుకొని నిలువంబెట్టుకొనుట
యుచితమగుటయే కాక నాకుఁ బరమసమ్మతము.

శంబు :- నాయనా! కార్యములు మాటలంతసుకరములు
కావు. పై పెచ్చు తెఱచాటుననున్న మహానుభావుఁ
డెవ్వఁడో యెఱుంగుదువా? వసిష్ఠమహాముని. ఈ
వాక్యములెవ్వరివని నీయాలోచనము?

శిష్యుడు :- శ్రీరామచంద్రునివని; ఇందులకు సందియమేల?

శంబు :- నీవుపొరఁబడితివి. కాదు. ఇవి వసిష్ఠుని వాక్యములు.
స్మృతివిహిత ధర్మతిరస్కారులని యుత్తరమునందుఁ
బేర్కొనఁబడినది. ఇంకదీనికి వాదమేమున్నది? ప్రతి

పక్షరచితగ్రంథములగుటచే స్మృతులు మనకాదరణీయ
ములు గావను మనమొఱ్ఱ నెవరాలకింతురు ? వేద
ప్రతిషిద్ధమని చెప్ప సాహసించెనేమో చూచి
తివా ? దీనికి సభాముఖమునఁ బరిష్కారమేమున్నది ?
ఒక్కటేగతి. వారు వేద ప్రామాణ్యము నంగీకరింపరు.
మనము స్మృతి ప్రామాణ్యము నంగీకరింపము.
మనవాదము ధర్మాధికారికి ధర్మవిరుద్ధమగును.
మనము శిక్షకుఁ బాత్రులమగుదుము. ఇంతియే ఱేపు
జరుగనున్నది. కానఁ బత్రమును లేఖిని గొనిరమ్ము.
ప్రత్యుత్తరమంపెదము.

(శిష్యుఁడు నిష్క్రమించి పత్రము లేఖినితో ప్రవేశించును)

సిద్ధముగనుంటివా ! నేను జెప్పు వాక్యములు వ్రాయుము.

(శంబుకర్షి చెప్పుచుండఁగా శిష్యుఁడు వ్రాయును.)

అతి లోభంబునుబూని యాత్మహిత కార్యస్థాపనాచార్యులై
స్మృతి నిర్మాణవిదగ్ధులై తనకు వారిన్ సభ్యులంజేసి త
ద్ధిత పక్షుండవు ధర్మపీఠము నయుం, దేకూరుచున్నంత మా
గతియేమౌనో యెఱుంగఁ జాలమొకో యింకన్ రామమా
చంద్రప్రభూ !

మతనిర్మాణముకై వచించి ఋషులా, మ్నాయంబులంబిమ్మటన్
స్మృతులన్ జెప్పిరి యార్యసంఘ మొగి వర్ధిల్లంగ మేమందుచేఁ

జతురామ్నాయములందలంచుచు నమస్కారంబులం జేయుచుఁ
స్మృతిధిఃకారముజల్పఁబూనితిమి మా క్షేమాభిలాషంబుచే

ప్రభుచూడామణి! మీరు వేదములనే ప్రామాణ్యమన్నట్టిచో
సభకే తెంచెద, మట్లుగానియెడ మీ సాన్నిధ్యముం జేరి మీ
సభకుల్ చేసెడి వాదముల్ వినుటకుఁ సామర్థ్యముఁ లేదు, మా
కభయం బిచ్చెడువారు గానఁబడరే న్యాయంబుపోకుండఁగన్

ఇయ్యది చాలు. ఈయుత్తరముం గొంపోయి సేవకుని కిమ్ము. ఆవలనేమిజరుగునో యోర్చిచూచెదము. కార్యంబులఁ దీర్చికొనుటకు సరయూనదికిఁ బోవలయును. ఇఁక జిరకాలము శాంతముతో సంధ్యావందనాదులఁ జేసికొనుటకు వీలుండదు.

శిష్యుడు :- చిత్తము. నిష్క్రమింతురు.

తృతీయాంకము.
సంపూర్ణము.



# శంబూక వధ
## (ఉత్తర రామచరిత)

చతుర్థాంకము.

(శ్రీరామచంద్రుని ప్రవేశము)

శ్రీరామ:- అబ్బా! రాజ్యమేలుట కత్తిమీఁది సాము గదా!

గీ॥ తెలిసి యపచార మిసుమంత సలుపకుండ
జపముఁ జేసుకొనుచునుండు సాధువులను
బట్టివర్ణాశ్రమాచార పాలనంబఁ
టంచుఁ బరిమార్పఁగావచ్చె నక్కటకట!

ఇందుచేతనే తొల్లింటిపుణ్యమూర్తులగు ఋషులు "రాజ్యాంతే నరకమ్ ధ్రువమ్" అని నుడివిరి. రామ రాజ్యమునందే యిట్టి చిత్రములు జరుగవలయునా? శంబుకుని శిక్షింపకున్న యెడల వంశగురువున కేమి యలుకవచ్చునో కదా?

గీ॥ రాజ్యరక్షణవిషయమ్మై రాజు జాలిఁ
బూనఁదగదంచు గురుమూర్తి యానతిచ్చెఁ
గాని తత్త్వజిజ్ఞాసుల కంఠనాళ
ములనుగోసి రాజ్యముఁ జేయ బోవలేను.

అయినను శంబుకునితోఁడఁ బ్రసంగించి చూచె
దను. ఓరీ! యెవఁడురా యక్కడ?

దా :- (ప్రవేశించి) స్వామి! యేమియాజ్ఞ?

శ్రీరామ:- ఓరీ! మొన్న కాంభోజరాజుపాయనంబుగాఁ
బంపిన యుత్తమాశ్వమును సజ్జీకృతముఁ గావించి
వెంటనే కొనిరమ్ము.

దా :- చిత్తము. [నిష్క్రమించి మరల గుఱ్ఱముతోఁ
బ్రవేశించును]

శ్రీరామ:- [గుఱ్ఱమెక్కి] ఛీ! యెడమకన్నదరు చున్నది.
కారణమేమి చెపుమా?

గీ॥ నాకు గురువెన్ని స్మృతులు క్రో ♦ డీకరించి
చెప్పినను ధర్మమిదియంచుఁ ♦ జిత్రమేమొ!
సంశయాత్ముఁడనైతినీ ♦ సమయమందుఁ
గారణముమాత్రము మదికిఁ ♦ గానరాదు

గీ॥ అంతరాత్మ పీడితుఁడను నగుటచేతఁ
జేయునదిలేక మనసెల్లఁ జెదరుచుండె
నిట్టిసమయంబునను యుక్త మిదియటంచు
నెట్లుబుద్ధికిఁబోడమునో! యెఱుఁగరాదు

[నిష్క్రమించును]

—♦ చిదానందాశ్రమము ♦—

(బడలికతో శ్రీరామచంద్రుఁడు ప్రవేశించును.)

శ్రీరామ:- అబ్బా! సూర్యాతపముచేత డస్సిన నాసర్వాం
గములను సేదదేర్చుచున్న యీమృదుసౌరభశీతల

ములగు మలయపవనకిశోరములు నాకు బ్రహ్మా
నందముఁ గూర్చుచున్నవి. పాంథులపథికాయాస
మును నపనయింప నేనెఱుంగకుండ నీయారామ
ప్రతిష్ఠఁ గావించినవాఁడెవఁడై యుండనోపు?
(దిక్కులు పరికించి) యేమి యీ యకాల వసంతా
గమము. లతాసమావృతములయిన యీనికుంజ
పుంజములు కోరకితములును, పుష్పితములునై యీ
యారామ నివాసిమాహాత్మ్యమును బ్రకటించు
చున్నవి. (ఉలికిపడి) యేమి! యౌరౌర!! యాశ్చ
ర్యము. చిలుకగోర్వంకలెల్లను వేదపాఠములను బఠిం
చుచున్నవి. అయ్యారే! కోయిలలా సామగానము
జేయుట? ఏ జితేంద్రియుని పవిత్రాశ్రమమో కదా
యిది. కనుఁగొనియెద. ఋష్యాశ్రమమునకు నశ్వా
రూఢుఁడనై పోవుటయు క్రమమా? కాదు. (అశ్వావరో
హణముఁ గావించి ముందునకు నడచి సోమలతకుఁ
బాదుత్రవ్వి నీళ్ళుపోయుచున్న బ్రహ్మచారింగని)
కుమారా! యిచ్చట యేమిచేయుచున్నావు?

బ్రహ్మచారి:- (తలయెత్తి చూడకే పాదుఁద్రవ్వుచు)
యేమిచేయుచున్నానో కన్పట్టుటలేదా? (అనంత
రము శ్రీరామునివంక నెగాదిగఁ జూచి) ఇదిగో!
దర్భాసనంబు. ఇచ్చట దయచేయుఁడు. అతిథిపూజ
మాకు గురూపదిష్టంబు. మా గురువుగారిని జూచి
పోవుటకై మొన్న కణ్వులవారువచ్చి యీ సోమ
లతను నిచ్చిపోయిరి. దానికి నీరుపోసి పెంచుటకు

మా గురువుగారాజ్ఞయిచ్చిరి. ఆ పని యిప్పుడు నేను జేయుచున్నది.

శ్రీరామ-: కూర్చుండెదఁగాని, యీ యాశ్రమ మెవ్వరిది? మీ గురువుగారి పేరేమి ?

బ్రహ్మచారి:- ఇంతియేనా ? నీ కేమియో తెలియునను కొంటిని (రాముఁడు చిఱునవ్వు నవ్వుచు బ్రహ్మ చారిని వీపున దట్టుచుండును.) ఇది మా గురువుగారి యాశ్రమము. బ్రహ్మర్షీంద్రుఁడగు శంబుకర్షి మా గురువుగారు.

శ్రీరామ:- ఏమీ! శంబుకర్షియా?

బ్రహ్మచారి:- [అబ్బురముతో] ఏమి యులికిపడుచున్నావు? ఎప్పుడును పేరు వినలేదా ? నీ వేదియో పట్టణవాసి వని తోఁచుచున్నది.

శ్రీరామ [తనలోఁ బరాకుతో] నాడఁబోయిన తీర్థ మెదురైనట్లున్నది. (ప్రకాశముగా) అవును. పట్టణవాసినే; కాని మీ గురువుగారిని దర్శించుటకు వీలుండునా?

బ్రహ్మచారి:- ఓ! యిదియే మంచిసమయము. మా గురువుగారీవేళనే శిష్యులం గూర్చికొని మతప్రసంగముఁ జేయుచుందురు. ఇదియేదారి. చూచితివా? ఈ దారినే పోయి యాబట్టలాఱవైచిన పొదదగ్గరనుండి యా కుటీరము బ్రవేశించిన మా గురువుగారిని జూడఁగల్గుదువు. (ఏదియో జ్ఞాపకమునకు రాఁగా) పొరబాటు. ఆఖర్జూరవనమునం దీవేళ మతోపన్యాసముఁ జేయుచుందురు.

శ్రీరామ:- సరియే నేను వెళ్లెదను. (ముందుకునడచి తిరిగి వచ్చుచుండును.)

బ్రహ్మచారి:- ఏమి తిరిగి వచ్చుచున్నావు? దారి తెలియ లేదా? నేను జూపించెదను రమ్ము.

శ్రీరామ:- అట్లుకాదు. నీవు ముందుపోయి మీ గురువు గారితో శ్రీరామచంద్రుఁడు మిమ్ములను జూచుటకు వచ్చుచున్నాఁడని చెప్పఁగల్గుదువా?

బ్రహ్మచారి:- (నివ్వెరఁగంది) ఏమి! శ్రీరామచంద్రులా? మా రాజుగారా? దేవా! యెవ్వరో సామాన్యులను కొని మీకుఁ దగినసత్కారమును జేయలేదు. రాజాధి రాజులను సందర్శించినపుడెట్లు చరియింపవలయునో మా బాబయ్యగారులు జెప్పలేదు. ఇన్నిటికి ఛాంద సులముకదా? క్షమింపుఁడు.

శ్రీరామ:- (బ్రహ్మచారి దగ్గఱకుఁదీసి) కుమారా! నీవలన దోషములేదు. నీమాటలవలన మాకానందముగల్గు చున్నది. రాజాధిరాజులను సందర్శించునప్పుడెట్లు చరియింపవలయునో గురువుగారు చెప్పలేదా? రాజాధి రాజులను గుర్తించు విధమయినను దెల్పలేదా?

బ్రహ్మచారి:- దేవా! లేదు. మిమ్ములను రెండవమాఱు చూచినప్పుడెవ్వరో గొప్పవారను కొన్నానుగాని, మరల గొప్పవారు మాయాశ్రమమున కెందులకు వత్తురాయని-

శ్రీరామ:- నీ బేలతనము మమ్మానందము పాలుచేయు చున్నది. మీ గురువుగారు నీకేమియుఁ జదువు చెప్పరా? చిన్నవని కాఁబోలు.

బ్రహ్మచారి:- స్వామీ! అట్లుకాదు; అట్లుకాదు. నన్నుఁ బోలు చిన్నలకుఁ బ్రొద్దుననే సంధ్యావందనాదుల దీర్చుకొనిన యనంతరము, భగవంతునిగూర్చి కొన్ని కొన్ని సంగతులు చెప్పుదురు. ఆవల మేము పాఠములను జదువుకొనుటకుఁ బోవుదుము. మధ్యాహ్న సమయమున వైయాకరణులతోడను, మీమాంసకులతోడను బ్రసంగముఁ గావించుచుందురు.

శ్రీరామ :- మీ గురువుగారు మిమ్ముల నెప్పుడయినఁ గోపపడుచుందురా ?

బ్రహ్మచారి :- దేవా! లేదు. ప్రసన్నవదనముతో మాటాడుచుందురు. గురువుగారని పిలువము. బాబయ్యగారని పిలుచుచుందుము. మమ్ములను జూచుటతోడనే చిరునవ్వునవ్వుచుఁ గబురులు చెప్పుచుందురు. బాబయ్యగారిని జూచుటతోడనే మాకు సంతోషముప్పొంగివచ్చును.

శ్రీరామ :- సరే! అటులనా ? నీ విప్పుడేమి చదువుకొనుచున్నాఁడవు ?

బ్రహ్మచారి :- సంస్కృత భాషాపరిచయమును గల్గించుకొనుచున్నాఁడను. సంస్కృతము నేర్చికొనుట మిగుల కష్టము. మొన్న మా బాబయ్యగారు వ్యాకరణ మారంభించెదమని చెప్పినారు. అప్పటినుండియు నాకుఁ జెప్పరాని యానంద మబ్బుచున్నది.

శ్రీరామ :- అంత సంతోషముగా నున్నదిగా ? మంచి మాటయే. నీ కేమయినఁ గావలయునేమో చెప్పుము. మే మిచ్చెదము.

బ్రహ్మచారి :- బ్రహ్మచారులకుఁ గోర్కెలేముండును, విద్యా వ్యాసంగముదక్క ? ఆ విద్యను బాబయ్యగారు చెప్పు చునేయున్నారు. అయినను నితరులనుండి యే వస్తు వైన నూరక తీసికొనుట దోషమని బాబయ్యగారు చెప్పుచుందురు. వారికిఁ గోపము వచ్చు పనిఁ జేయఁ జాలను.

శ్రీరామ :- మేమిచ్చిన వస్తువు దీసికొన నొల్లవా ?

బ్రహ్మచారి :- మా బాబయ్యగా రిష్టపడినయెడల.

శ్రీరామ :- అట్లయిన మీ బాబయ్యగారిని గనుఁగొందును గాని నీవుపోయి మేము వచ్చితిమని తెలియఁజేతువా?

బ్రహ్మచారి :- చిత్తము. సంశయమెందులకు ?

(నిష్క్రమింతురు.)

—♦ ఖర్జూర వనము ♦—

(పీఠముపై శ్రీరామచంద్రుఁ డుపవిష్టుఁడగును. శిష్యగణ పరివృతుండై శంబుకర్షి సమీపమునఁ గూర్చుండును.)

శంబు :- దేవా ! మాయాశ్రమము నేఁటికిఁగదా పవిత్ర మైనది. మీకాతిథ్యము నొసంగి మేము జరితార్థుల మైతిమి.

శ్రీరామ :- సంయమీంద్రా ! మిమ్ములను దర్శించి మేమును బరితుష్టులమయితిమి. కాని మతవిషయకప్రసంగమును జేయనుద్దేశించి యీయెడకరుదెంచితిమి. రాజధర్మము మీకుఁ దెలియనిదికాదు. మేము సనాతనధర్మ సంస్థా

పనాచార్యులము. సనాతనధర్మ రక్షణార్థమై సూర్య వంశము సాకేతపుర సింహాసనమునుండి సూర్యుని దొట్టి నేటిదనుక రాజ్యమేలుచున్నది. కాన మతరక్షణము మాకుఁ గర్తవ్యమే కాక విధ్యుక్తధర్మము. మతద్రోహము మాతలకంటగింపు. మేము సహింపము. మా ప్రజలయందెట్టి మత ద్రోహియున్న శిక్షించుటకు వెనుదీయము. హిందూమతమునఁ బుట్టి హిందూమతమునఁ బెఱిగి, హిందూమతమునకు ద్రోహమాచరించువాఁడు నరకకూపమునఁ బడకమానఁడు. మేము నిమిత్తమాత్రులమయి యానీచుని శిక్షాపాత్రునిఁ జేసెదము.

శంబు :- దేవా! యిది నేనెఱుంగనిదికాదు. మతద్రోహులను శిక్షాపాత్రులఁజేయుట రాజధర్మము. కానినాఁడు రాజులు తమధర్మము నెఱవేర్చని పాపమునఁబోదురు.

శ్రీరామ :- అందుచేతనే నేఁడు మేమిచ్చటి కరుదెంచి మీరు చేయుచున్న కార్యములు, మతోపన్యాసములు, మతద్రోహములగునో కావో నిర్ణయింప నిశ్చయించు కొంటిమి.

శంబు :- సకలధర్మస్వరూపులగు మీరీకార్యముఁ బూనుట కంటె మాకు సంతోషదాయక మగు కార్యమేమున్నది? మీసాన్నిధ్యమున నీకార్యము నిర్ణయింపఁ బడుటకంటె మాకు వలయునది యేది? దేవర వారడిగిన ప్రశ్నములకు నాయెఱిఁగినయంతవట్టునకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకు సంసిద్ధముగనున్నాఁడను (శిష్యు

లకై తిరిగి) వత్సలారా! మీరు పర్ణకుటీరమున వేద పారముఁ జేయఁబొండు. (శిష్యులు నిష్క్రమింతురు)

శ్రీరామ :- అట్లయినచో వినుఁడు. మీరు కొన్నినాళ్ళ నుండి చేయుచున్న హితోపదేశములును, మతోప దేశములును మా శ్రవణవిదారణముగనున్నవి. మహర్షు లందఱును, స్మృతికర్తలెల్లరును మీకుమత వ్యాసంగ మునకు నధికారములేదని చెప్పుచున్నారు. కాని మీరావాక్యములను బెడచెవులను బెట్టుచున్నట్లున్నది.

శంబు :- దేవా! మన్నింపుఁడు. ఎందుచే నధికారము లేదని చెప్పుచున్నారు?

శ్రీరామ :- "శూద్రులకు వేదములను జదువుటకుఁ గాని ముట్టుటకుఁగాని యధికారము లేకపోవుటయే కాక మతప్రసంగమును జేయుటకుఁగూడ నధికారములేదు. బ్రాహ్మణులుచెప్పిన నీతులను గ్రహింపవలయునుగాని ప్రశ్నింప రాదు" అని వీరివాదము. దీనికి మీరేమి ప్రత్యుత్తరముఁ జెప్పెదరు?

శంబు :- ఇందు రెండు సంగతులు విచారింప దగియున్నవి. అవియెవ్వి యంటిరేని, చెప్పెద, సావధాన మనస్కు లరై వినుఁడు. మొట్టమొదటిది మేము శూద్రశబ్ద వాచ్యుల మెట్లగుదుము? ఆశబ్దమును మామెడకేల యంటఁగట్టెదరు? మేము ద్రావిడులము. మానామ ములు మాకున్నయవి. మాపూర్వులు పరాజితులయి నంత మాత్రమున నిష్టమువచ్చిన నామములచే మమ్ము వ్యవహరించుట పాడియా? అయిన దీనితోనేమి?

భిన్ననామములచే వ్యవహారించినంతనే పదార్థములు నైజధర్మమును విడనాడవుకదా; ఇఁక రెండవది, మాకు మతప్రసంగమునకే యధికారములేదనుచున్నారు. ఇదియెవ్వరి యాదేశము, కారణమేమి చెప్పెదరు?

శ్రీరామ :- ఋషుల యాదేశము, స్మృతుల యభిప్రాయము ; ఋషుల యాదేశమునకుఁ గారణముకూడ వలయునా ?

శంబు :- దేవా! ఋషులు సర్వస్వతంత్రులు కానఁ గారణమక్కఱలేనిమాట నిజమే; ఇష్టమున్నయెడల నిన్నటి స్మృతిని వీరు నేఁడు మార్చఁగలరు. మార్పఁగలరనుట యేల? మార్చిరి, మార్చుచున్నారు. ఇందులకుఁ దార్కాణము, భిన్నస్మృతులు ; అందుగల పరస్పర విరోధములు; అట్టిచోఁ బ్రతిక్షణము మాఱుచున్న యీ స్మృతులుగాని తత్స్మృతికర్తలుగాని మాస్వత్వ మిట్టిదియని నిర్ణయించుటకెట్టులు శక్తిమంతులగుదురు ?

శ్రీరామ :- (విసుగుతో) ఋషులను, స్మృతులను ధిక్కరింప మొదలిడితిరా ?

శంబు :- శ్రీరామచంద్ర ప్రభూ! మీరు ధర్మమూర్తులు, ధర్మాధర్మ నిర్ణేతలు కాన నా ప్రార్థనము శాంతముతో నాలింపుఁడు.

నేను ఋషులను దూలనాడుటలేదు. తూలనాడుట లేదు. తూలనాడుట వలన మాకుఁ గించిల్లాభముకూడ లేదు. ఋషుల మనోగతితోపాటు క్షణక్షణము మాఱుచుండు ధర్మశాస్త్రములెట్టు లొక్కజాతిస్వత్వమును

నిర్ణయింపఁజాలునో తెలిసికొనఁగోరుచుంటిని. మీరా స్మృతులను బాటింపకున్న నవియేమగును ? ఇదిగాక మేము దుర్బలులమగుటచేతనేకదా మమ్మధోలోకము పాలుసేయుటకే సృజింపఁబడిన గ్రంథములను ధర్మాధికారులుకూడ ధర్మశాస్త్రము లనుచున్నారు. దేవా! యివి యార్తాలాపములు. ఆలింపుఁడు. "దుర్బలస్య బలమ్‌రాజా" యన వినమే ? దోషులమయిన శిక్షింపుఁడు. నిర్దోషులమయిన రక్షింపుఁడు. ఇంతియే కోరునది.

శ్రీరామ :- సంయమీంద్రా ! వినుచుంటిమి, వినుచుంటిమి. మీరు చెప్పఁదలఁచినదంతయుఁ జెప్పుఁడు. ఆవల దోషులరో, నిర్దోషులరో విచారించి నిర్ణయింతుము.

శంబు :- దేవా ! యాలించు ప్రభువులున్న నా హృదయావేదనమంతయు వెలిబుచ్చుకొనెదను. మేము హిందూ మతమును స్వీకరించిన కారణమున మానవసామాన్యములయిన హక్కులను మాయొద్దనుండి బలవంతముగా గుంజుకొనుట యెట్టిధర్మము ? ఎట్టినీతి ? సృష్టికర్త యెడల భక్తివిశ్వాసములను దెలుప నానందరసమగ్నములై యెల్లప్రొద్దుల నెల్లచోటులఁ బాడు పక్షిగణమునకున్న యాపాటి స్వాతంత్ర్యము మాకుండఁదగదా ! ప్రజ్ఞాచక్షువులేని జీవరాసులకున్న యధికారము మాకుండఁగూడదా ? మే మేమియు నవినీతి కార్యములకుఁ జొరలేదు. ఈ చరాచరములను, జేతనాచేతనములను సృష్టించినయా "ఏకమేవాద్వితీయమ్

బ్రిహ్మామ్" ను సేవించుటకును, గీర్తించుటకును, బాడుటకును, బూజించుటకును స్వాతంత్ర్యమును గోరుచున్నాము. చతుష్పాద జంతువులుకూడఁ బూర్వకర్మవాసనచేఁ గల్గిన జ్ఞానలాభమునఁ దపస్సమాధిని జెంది తరించినట్లు మనమువినుచున్నాము. అట్టి యధికారము మానవజన్మ మెత్తిన మాకుండఁదగదా? పిపీలికాది బ్రహ్మపర్యంతము వెలుఁగొందుచున్న యా దివ్యతేజముయొక్క సంకీర్తన పరాయణులుబ్బులైన యీబాలురకట్టి యధికారమేలయుండఁగూడదు? మీరాష్ట్రమున జన్మించితలఁదాఁచుకొనుటచేతనా? పూర్వులు గడియించి యిచ్చిన యీ ప్రాఁజదువులను వీరిని ముట్టకుండఁ జేసి యజ్ఞానకూపమునఁ బడద్రోసిన నీకార్యమునకు నెవ్వరుత్తర వాదులగుదురు? ప్రజల మానప్రాణ స్వత్వ రక్షణ భారమునకు మూలము రాజుకాఁడా? హిందూ మతస్థులమని మేము పిలుచుకొనుచున్నందులకుఁ బ్రతిఫలము మాకజ్ఞాన మొసంగుటా? హిందూసంఘశరీరమునందొక యవయవము క్రుళ్ళికుసుమారుచున్న నయ్యది యెట్లు తేజస్వంతముగనుండును? ఇది మాత్రము ప్రభువులకుఁ గీర్తిదాయకమా? మీరాజ్యమున జన్మించుటచేతనా మా కీపాట్లు?

శ్రీరామ :- సంయమీంద్రా! క్షణకాలమాగుఁడు. మీ యిష్టము వచ్చినట్లు తపస్స్వాధ్యాయనపరులుగండు. మీరు నిశ్చయముగా నీశ్వరధ్యానము సల్పుకొనవచ్చును. కాని వేదములిందులకు సమ్మతించునా?

శంబు :- దేవా ! మీరేయరయుఁడు, సత్యమును గనుంగొనుఁడు. వేదములు హిందువులకెల్లఁ దరణో పాయములుగ నేర్పడినవి; కాని క్షమింపుఁడు, పొరఁ బడితిని, మానవకోటి కెల్లరకును దరణోపాయములు. వేదచతుష్కముచే వికిరితమైనజ్ఞాన తేజమును గ్రహిం చినవారు, గ్రహింపనిష్టపడినివారు హిందువులనఁ బడుచుండిరి. హిందువులయ్యు నా లాభమును బొం దఁజాలనివారు మా బోంట్లు; కాన మేమెట్లు వేదము ములను బొందఁగూడదో ! యెట్లు భగవద్ధ్యానముఁ జల్పుకొనఁగూడదో దేవరవారే యోజింతురుగాక.

శ్రీరామ :- మునీంద్రా ! మీ మాటలు గ్రాహ్యంబుగఁ గన్పట్టుచున్నవి. మా రాష్ట్రివాసులకెల్ల సమానము లగుహక్కులనిచ్చి, పక్షపాతరహితముగ రాజ్యమేలుట మాకు విధ్యుక్త ధర్మము కాన మీరు నిశ్చింత నుం డుఁడు; మేము పోయివత్తుము.

శంబు :- (ఆనందపరవశుఁడై, భక్తిపురస్సరంబుగా) దేవర వారి పరిపూర్ణ కటాక్షమునఁ బవిత్రుఁడనైతిని. ఆర్తుల పాలిటి దైవతములుగదా భూనాథులు. మీ యీ మహత్కార్యముచే ద్రావిడలోకమెల్ల నాచంద్రా ర్కము కృతజ్ఞమైయుండును.

శ్రీరామ :- మేలు మీ రాజభక్తిచే మేము సంప్రీతుల మయితిమి.

(నిష్క్రమింతురు.)

(గుట్టముపై నానుకొన్న శ్రీరామచంద్రుఁడును, వసిష్ఠుఁడును)

వసి :- శ్రీరామచంద్రా! కార్య పర్యవసానమును దెలిసికొనుటకునై యీ కడకరుదెంచితిని, ద్రోహిని శిక్షించితివికదా!

శ్రీరామ :- ద్రోహుల శిక్షాపాత్రులఁజేయుటకు నయోధ్య పట్టణాధీశులం దెవ్వరును జంకువారు కారు.

వసి :- తరతరంబులనుండి యీ సంగతి మే మెఱుంగనిది కాదు. అందుచేతనే సూర్యవంశపౌరోహిత్యమునందు సుస్థిరులమయి యున్నారము. గుర్వాజ్ఞను దలపూవట్టులమన్నింపని ఛాత్రులు మన్ననకుఁ బాత్రులుగారు. గుర్వాజ్ఞను బ్రశ్నింపకుండ నొనర్చుట శిష్యధర్మము. ఈ గురు శిష్య ధర్మ మిప్పటిదియా? సృష్ట్యాదినుండి పరంపరానుగతికమయినది. ఇన్నిటికిని మఱచితి. శంబుకుని శిష్యులనంపఱి నెక్కడికంపితివి? వారలకుఁగూడఁ నల్పశిక్షయయిన విధింప వలసినదియే.

శ్రీరామ :- ఇచ్చటనే యీ చిదానందాశ్రమములోనే యున్నారు.

వసి :- ఎక్కడ నుండిన నేమిగాని కట్టుదిట్టములు చేసితివి కదా? కన్నులు గానక మిట్టిపడి వర్ణాశ్రమాచారముల దిగఁద్రావి చెలరేఁగిన గురువునకుఁ బట్టిన గతియే పట్టునని ఖండితముగాఁ జెప్పితివా? ఈ దురాలోచనములఁ బుట్టినప్పుడే మాన్పుట మంచిది.

శ్రీరామ :- గురువరా! శంబుకసంయమికిఁ గలిగిన గతి యనియా మీ యభిప్రాయము ?

వసి :- అగును (ఆశ్చర్యముతో) నీవుకూడ సంయమియను చున్నాఁడవే ?

శ్రీరామ :- ఇంద్రియ సంయమముఁ గావించినవాఁడు సంయమి కాఁడో! దీనికేమిగాని శంబుకసంయమికి సంభవించిన దుర్గతియేమి ?

వసి :- రఘురామా! మమ్మొక్కసక్కెముఁ జేయుచున్నావా? ఇప్పుడు శిక్షించితినని చెప్పితివే ?

శ్రీరామ :- దేశికేంద్రా! క్షమింపుఁడు, మే మట్లు చెప్ప లేదు.

వసి :- ద్రోహుల శిక్షాపాత్రులఁ జేయుపట్ల నయోధ్యాపట్టణా ధీశులందెవ్వరును జంకువారు కారన్నమాట నీవనినది కాదా ?

శ్రీరామ :- అగును, మేమనినవాక్యమే.

వసి :- అట్లయిన శంబుకుని శిక్షింపలేదనుచున్నావే ?

శ్రీరామ :- శంబుకసంయమిని శిక్షించుటకుఁ బూర్వము ద్రోహియని స్థిరపడవలయునుగదా ?

వసి :- మనవాదమంతయు "ఘట్టకుటీప్రభాతన్యాయమ"యి నది. స్మృతు లేమి చెప్పుచున్నవో విన్పింపలేదా ? స్మృతివాక్యంబులను బాటించుటకన్నను రాజధర్మ మేమి కలదు ? హిందూమతమునకు స్మృతులు మూలా ధారములు. ఆ స్మృతివాక్యముల ననుష్ఠేయములుగాఁ

జేయుట రాజధర్మము. స్మృతులు ద్విజేతరులకు దప స్స్వాధ్యాయములను నిషేధించుచున్నవి. వానిని బాటింపక శంబుకుఁడు మతద్రోహముఁ జేయుచున్నాఁడు నీవు వానిను పేక్షఁజేయుచు రాజధర్మమును నొక మూలకుఁ ద్రోయఁజూచుచున్నావు. అయోధ్యాధీశు లెవ్వరిట్టిపనులకొడిఁగట్టలేదు తొల్లి.

శ్రీరామ :- మీ వాక్యములు సత్యమునే ప్రకటించుచున్నవి. మీరు శంబుకసంయమిని మతద్రోహిగా రుజువు చేయఁగలిగితిరో నిష్కారుణులమై వానిని శిక్షాపాత్రునిఁ జేసెదము. మేమింతదనుకను శంబుకసంయమితోఁ బ్రసంగించితిమి కాని వాని వాక్యము లాదరణీయములుగఁ గన్పట్టుటచే మేమే యీయధికార మిచ్చివచ్చితిమి. నిరపరాధుఁడుగఁ గన్పట్టు శంబుకుని దునుమాడి పాపమునఁ బోవనొల్లము. రాజులు సర్వప్రజానురంజకులై నేల నేలఁదగువారుగాని కొందఱి యుపదేశముల నమ్మి యపరాధరహితులను బాధపఱచుటకుఁ దగువారు కారు.

వసి :- (కుపితుఁడై కమండులువు నేలంబెట్టికొట్టి) గురు తిరస్కారమునకుఁ గడంగుచున్నావు. బ్రాహ్మణులిట్టి తిరస్కారము సహింపనొల్లరు. బ్రాహ్మణుల శక్తిఁ బరీక్షింపవలయునని తోఁచెఁగాఁబోలు. అట్లయిన వినుము. రేఁగిన కార్చిచ్చువలె సర్వలోకములను దగ్ధపటలముఁ జేయఁజాలును.

శ్రీరామ :- దేవా! యిది మే మెఱుంగనిదికాదు. పరశురాముని మే మెఱుంగమనుకొంటిరా? ఎందుకయిన నోర్తుముగాని మేము విశ్వసింపని కార్యములఁ జేయనొల్లము. ఇయ్యది క్షత్రధర్మము. ఇది యిట్లుండ మే మరణ్యమునఁ గ్రుమ్మరునప్పుడు గుహుఁడు చేసిన సాహాయ్యమును మఱవుమందురా? శబరి కనంబఱచిన యవ్యాజభక్తిని విస్మరింపుమందురా? ఈ యలంతుల మాటయేల? హనుమదాదులు చేఁదోడువాఁదోడుగా కున్న వారధిఁగట్టఁగల్గుదుమా? రావణ సంహారముఁ జేయఁగల్గుదుమా? ఆర్యులమైన మనమనార్యులపాటి కృతజ్ఞులమై యుండఁ దగదా? రాజనీతి మాట యటుంచి తోడ్పడినవారికిఁ బ్రతిఫలముఁ జూపుట మానవ సామాన్యమగు నీతికాదా?

వసి :- శ్రీరామచంద్రా! నీ వాముష్మికముమాటఁ దల పెట్టక యైహికం బాలోచింపుము. వీరందఱికి సమాన స్వత్వ మొసంగిన మా పాట్లేమగును? తరతరంబుల నుండి బ్రాహ్మణ క్షత్రియజాతులు రెండును మిథ స్సాహాయ్యంబున వర్తించుట యెఱుంగవో? లేకున్న మీ రాజ్యమును మా కులగౌరవంబును జిరకాలము నాఁడే పేరులేకుండెడివి. కావున నట్టి యుపద్రవమును దప్పించుటకే యింత తఱచి తఱచి చెప్పుచుంటిమి.

శ్రీరామ :- (చుఱుకుచూపులతో) దేశికేంద్రా! బ్రాహ్మణ సాహాయ్యంబు వలననే రాజులు రాజ్యమేలిరనియా మీ యభిప్రాయము?

వసి :- (ఆశ్రమముతో) కాదు, కాదు; క్షత్రియులు కత్తితోఁ దీర్పఁదగిన పనిని బ్రాహ్మణులు మాటలతోడనేతీర్చి రాజుల యలజడిని బాపిరని నా యభిప్రాయము.

శ్రీరామ :- చిత్తము ! మంచిమాటయే.

వసి :- కావున నీ రెండు జాతులు పరస్పర సౌభ్రాత్రముననే సౌభాగ్యమును, గౌరవమును నందియుండగలవు. దీనికి వ్యతిరేకమయినచో నంతఃకలహములచే దినదినము సంక్షీణభావ మందఁగలవు. ఇది నిస్సంశయము.

శ్రీరామ :- ఒకజాతి సౌభాగ్యమునకయి మఱియొక జాతిని సర్వకాల సర్వావస్థలయందు బానిసతనమునందుంచి మూర్ఖులను జేయుట రాజనీతియగునా ? రాజధర్మము ప్రజలను నిష్పాక్షికమయిన బుద్ధితోఁ బరిపాలించుట కాదా ?

వసి :- శ్రీరామచంద్రా ! ఇందొక్క జాతిస్వత్వమును హరించి బానిసలుగా నుంచుట యేమున్నది ? వీరు మీ పూర్వులతో నడుముకట్టుకొని పోరి తమహక్కులను గోల్పోయిరి. పరాభూతులయిన శత్రువులు లోఁబడిరని చెప్పి స్వత్వ సామాన్యము నొసంగుట రాజనీతి విరుద్ధము కాదా ?

శ్రీరామ :-మహాత్మా ! శరణాగతరక్షణ బిరుదంబుఁదాల్చిన మాకు మీ వాక్యములు బోధపడవు. మీ యుపదేశప్రకారము మే మాచరించిన భవిష్యదంతర్వాణులు మమ్మేమిగా భావింతురు ?

వసి :- మహాపురుషుఁడవనియు, రాజదేవేంద్రుఁడవనియు, భగవదవతారమ వనియు భావింతురు.

శ్రీరామ :- ఇదియెట్లు తటస్థించును ?

వసి :- ఇది యెట్లు తటస్థించునని సంశయచిత్తుఁడ వైతివా ? వినుము చెప్పెదము. ఇంతటి నిర్దాక్షిణ్యముతో రాజ ధర్మమును నెవ్వరు నిర్వర్తింపఁగల్గిరి ? ఇంతటి ధర్మ బుద్ధితో స్మార్తధర్మము లెవ్వరు పరిపాలింపఁగల్గిరి ? నీ విట్టి ధర్మ నిర్వహణముఁ జేయుచో ఋషులేల నిన్ను భగవదవతారముగాఁ గొనియాడరు ? వర్ణాశ్ర మాచార పరాయణ శీలుఁడయిన రాజు నిమిత్త మాత్రుఁడై వర్ణసాంకర్యముగల్గఁజేయువారల శిక్షించు నని స్మృతులు చెప్పుటలేదా ? లెమ్మి.

శ్రీరామ :- మీరెంత చెప్పినను శంబుకుని వధకు మనసు పోకున్నది. ఇతఁడు నిరపరాధియని మా విశ్వాసము.

వసి :- అపరాధియైననేమి ? నిరపరాధియైననేమి ? శాస్త్ర సమ్మతమైననేమి ? గర్హితమయిననేమి ? ఒక్కని మరణముచే రెండుకులములు సిరిసంపత్తులచేఁ దులఁ దూఁగునప్పుడు, తామరతంపర క్రియ వృద్ధి నందు నప్పుడు వెనుకంజవేయకుము. ఆత్మరక్షణ మెల్లజీవు లకు నవశ్యకర్తవ్యము.

శ్రీరామ :- పాపముఁజేసి మనుటకన్నఁ బరోపకార మాచ రించి, మరణించి యశఃకాయుఁడగుట యుక్తము కాదో ?

వసి :- అందుచేతనే నిన్ని కార్యమునకుఁ బురికొల్పుట. లేకున్న ధర్మసూక్ష్మ వేదులమయిన మే మిట్టిపనికిఁ బూనుకొందుమా ? ఒకనిని జంపి జాతిద్వయమును సముద్ధరించుట పరోపకారము కాదా ? లెమ్ము. కార్యోన్ముఖుఁడవుకమ్ము. ఆలసింపకుము.

శ్రీరామ :- (తనలో) కొంతవఱకు సందియము దీరినది. ఇది న్యాయముగాకున్న నీ మహానీయుఁ డింత పట్టుదలతో నేలచెప్పును ? (ప్రకాశముగా) గురువరా ! ధర్మాధర్మ విచారణ భారము గురుభుజస్కంధమున నుండును. గురూపదేశంబు వ్యపగతకల్మషంబుగాన శంబుకుని బరలోకప్రాప్తునిఁ జేసెదము. మేమిదే పోవు చుంటిమి, సెలవిప్పింపుఁడు. (పోఁబోవును, పాదు త్రవ్వి నీళ్ళు పోయుచున్న బ్రహ్మచారి వాక్యము లాలించి కన్నీటిచే డగ్గుత్తికవడినస్వరముతో శ్రీరామ చంద్రుని కడ్డపడి)

బ్రహ్మచారి :- మహాప్రభూ ! మాబాబయ్యగారిని జంపెదరా ? వలదు. వలదు. మమ్ములనందఱిని దిక్కులేని పక్షులను జేసెదరా ? ఇంతకుమున్ను నేఁగోరినవస్తువు నిచ్చెదమంటిరి. మాబాబయ్యగారి ప్రాణమునాకిండు. మాబాబయ్యగారిష్టపడినను బడకున్నను నేను మీ రిచ్చుదానమును గ్రహింతును. (ఏమి చెప్పుటకుఁదోఁచక శ్రీరామచంద్రుఁడు దిగాలున నిలువంబడియుండ వసిష్ఠుఁడక్రుస్రుగక్కుచున్న చూపులతోఁ బిల్లవానిఁ జేయిపట్టుకొనిలాగి) మిమ్మాదరించుటకు మేముంటిమి

లేమ్మా. ఇటురమ్మా. (శ్రీరామచంద్రునితో) పిల్లవానిమాటలతో నేమిగాని నీకార్యాచరణమునకుఁ బొమ్మా.

శ్రీరామ :- దేశికేంద్రా! అబముసుబమెఱుంగని కసుగందు. ఏమియుఁ జేయకోఁడు.

వసి :- మాది మాత్రము కన్నకడుపుకాదా? (శ్రీరామచంద్రుఁడు నిష్క్రమించును)

బ్రహ్మచారి :- (కంటినీరు కంటఁద్రుక్కుకొని) అయ్యా! మీరు లేకేమి? మాతాతలనాఁటి నుండియు సంపూర్ణ కటాక్షముతోఁ జూచుచునే యున్నారుకదా.

వసి :- లంకను బుట్టినవారందఱు రాక్షసులే. క్రొత్తలేమియుండును. ?

బ్రహ్మచారి :- మీరుచెప్పినదిమాత్రము నిజముకాదు. లంకలోఁబుట్టిన విభీషణుఁడు రాక్షసుఁడు కాఁడు? (నిష్క్రమణము)

(శ్రీరామచంద్రుఁడు తపోనిష్ఠనున్న శంబుకుని జేరి కోశముననున్న ఖడ్గమునుబెఱికి, ఝళిపించి మరల నాఁగి విషాదముతోఁ గుడిచేయివంక దేటిపాఱఁజూచి)

కరుణయొకింతలేక కుల కాంతను, సాధ్విని, బూర్ణగర్భిణిన్ వరఁకు నరణ్యభూములకుఁ బంపఁగఁజాలినయట్టి నీకు దుర్భరమగునే యొకానొకని ప్రాణముతీసెడుపట్ల నూనిశేఖరుఁడగుఁగాక, జాలియెటు కల్గును? దక్షిణబాహుదండమా!

(మరల నుత్సాహముతో ఖడ్గమెత్తి)

క్షత్రధర్మంబు స్మృతివాక్య సమ్మతంబు
ధర్మసంస్థాపనార్థంబు ధరణిలోన
సద్గురూపదిష్టముగాన జంకకుండ
శంబుకుని రామచంద్రుండు చంపుచుండె.

(భిన్నమస్తకుఁడై శంబుకుఁడు నేలవ్రాలును, దివ్య తేజము మింటికెగయును. శ్రీరామచంద్రుఁడు నిష్క్రమించును)

### శంబుక శిష్యుని ప్రవేశము.

ఏమందుఁగటకటా! యిట్టివిడ్డూర
మీముందు జరిగినే యెచ్చోటనేని?
చలిచీమనేనియుఁ జాఁద్రొక్కకుండ
వనసీమలోపల వసియించి యెపుడు
పవనభుక్తిఁ దపించు పరమపూరుషుని
శంబుక సంయమిచంద్రు మద్గురుని
బ్రాహ్మణులెల్లఁగాపట్యంబుతోడఁ
బసరిచ్చి యొక విప్ర బాలు, విసంజ్ఞు
గాఁజేసి యయ్యది కల్గె శంబుకుని
జపముచేననిచెప్పి చాటించి, రామ
చంద్రుచే మద్గురుఁ జంపించి పిదప
బ్రాహ్మణ బాలుండు బ్రతికినాఁడనిరి.

ఎన్నఁడే బ్రదుకునే యీల్గినవాఁడు ?
ఏమి యీ దుస్తంత్రి మేమి యీమాయ ?
ఏమి యీగారడి ? యేమి యీ కుట్ర ?
ఏమెట్టుజీవింతు మేమెట్టుబ్రదుకఁ
గలవారమికమీఁదఁ ? గాలుష్యమూర !
లోకాన నాలగోలును బాలగోలు
గగ్గోలు సేయవే ? క్రాచవే జగము ?
మా శోకవహ్నియు మాదు దుఃఖాగ్ని
కాల్చవే విప్రప్ర కాండులనైన
బాలుర శాపంబు బ్రహ్మ శాపంబు
కార్చిచ్చుఁబోలె లోకంబులనేర్చు
నీ దోషఫలమెల్ల నీ దేశమందుఁ
బ్రజలార ! వినుఁడు నా పల్కుల నన్ని
స్వాతంత్ర్యమంతయు సమసిపోవంగఁ
బారతంత్ర్యమునందుఁ బడిపడిపోయి
విద్యావిహీనులై విప్రులెల్లరును
సేవక వృత్తిలోఁ జిక్కిపోయెదరు
ధర్మంబు, శౌచంబు దయయు సత్యంబు
కొఱవడఁదమునెల్ల కులములవార
లేవగించఁగనుందు రేమితోఁచకయె

మఱుగుచునుందురు మాటిమాటికిని
దైవంబు దూఱుచుఁ దగవులేదంచు
నెందాఁక బ్రాహ్మణు లీదోషమెల్ల
దిద్దుకోలేరో యీ దేశంబులోన
నందాఁక నీ రీతి నల్లాడుచుంద్రు
సత్యంబు నామాట సత్యంబుసుండు.

సంపూర్ణము.

౨౦

# కవిరాజు రచనలు

1. ఖూనీ

2. కురుక్షేత్ర సంగ్రామము

## అచ్చులో

కుప్పుసామి శతకము

ధూర్తమానవా

సూతాశ్రమ గీతాలు

సూత పురాణము

(4 ఆశ్వాసములు)

